


### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

నూతనముగా ఏర్పడిన

## గృహలక్ష్మి ఏజంట్లు

హైదరాబాద్, సికిందరాబాద్ నగరములు: శ్రీ సత్యా న్యూస్ ఏజన్సీ 1/978 పబ్వారీ హౌస్, ముష్టీఫాబాద్, హైదరాబాద్, (డక్కన్)

చీరాల ; సంధ్య పబ్లిషింగ్ హౌస్
గోడవర్తివారి వీధి.

తెనాలి. జనత న్యూస్ ఏజన్సీస్,
బోస్ రోడ్డు.

రాయచోటి (కడపజిల్లా) :
శ్రీ యం. వి. చలపతి

కొండాపురం (కడపజిల్లా) :
శ్రీ వి. సూర్యనారాయణ

పోరుమామిళ్ల (కడపజిల్లా) :
శ్రీ జి. సుబ్బారాయుడు

గూడూరు : జనత ఏజన్సీస్ :

**అన్ని హిగిన్ బాదమ్స్ బుక్ స్టాల్సులోను గృహలక్ష్మి ప్రతులు అమ్మబడును**

# గృహలక్ష్మి ప్రచురణలు

| | | రు. |
|---|---|---|
| 1. | ఫిలోమెనాతంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | 0.75 |
| 2. | వేప (వైద్యగ్రంథము) : శ్రీ కె. యన్. కేసరిగారు | 0.75 |
| 3. | బిల్వ (వైద్యగ్రంథము) : ,, | 0.75 |
| 4. | అరవింద (నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | 1/- |
| 5. | శ్రీజ్ఞాన ప్రసూనాంబికా శతకము : శ్రీమతి గంటికృష్ణవేణమ్మగారు | 0.37 |
| 6. | నా చిన్ననాటి ముచ్చట్లు : శ్రీ కె. యన్. కేసరిగారు | 2/- |

## మా దగ్గర లభించు గ్రంథము

దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు 12.50

గ్రంథాలయములకు, ప్రజాహిత సంస్థలకు ధరలు తగ్గించబడును

## 'గృహలక్ష్మి'

### స్త్రీల మాసపత్రిక

28 సంవత్సరములనుండి మహిళాభ్యుదయానికి, అచంచలమైన కృషిచేయుచున్న స్త్రీల సచిత్రమాసపత్రిక, త్రివర్ణ చిత్రాలతోటి, విజ్ఞాన వికాసాలను పెంపొందించే వ్యాసాలతోటి, యింకా నాటికలు, కథలు, బాలవినోదంతోటి ప్రతినెల 15-వ తేది వెలువడుచున్నది. విడిప్రతి 40 న. పైసలు

ఏజంట్లులేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯] డిశంబరు 1957 [సంచిక ౧౨

# విషయసూచిక



ముఖచిత్రం :

కాశీనుండి తెచ్చి, రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠాపన చేసిన
శ్రీ చక్రసహిత బాలాత్రిపురసుందరి

చిత్రకారుడు శ్రీ వి. ఆర్. శ్రీపతి.



సందేశము




జయజయ గృహలక్ష్మీ స్త్రీసఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# యుగధర్మానుగుణ్యమైన విద్యా విధానం



నయీతాలీం సభకు పండిత నెహ్రూ సందేశము పంపిన సందర్భమున "విద్యా విధానము స్త్రీ పురుషులను యుగధర్మానుగుణంగాను, తమ విధ్యుక్త ధర్మాలను నిర్వహించే విధంగాను సుశిక్షితులను చేయడంలో తోడ్పడాలి. జాతిని నిర్మించేవారు స్త్రీ పురుషులే. వారిని రూపొందించేది విద్యా విధానము" అని పేర్కొన్నారు.

పండిత నెహ్రూ సందేశములో వాస్తవిక పరిజ్ఞానము ఉట్టిపడుతున్నది. దానిని అనుభవశాలురైన విద్యావేత్తలు, సంస్కరణాభిలాషులు గుర్తించినంత మాత్రమున

జరిగేమేలు అంతగాలేదు. వాస్తవికత కనుగుణ్యంగా స్త్రీ పురుషులను యుగధర్మాను గుణంగాను, బాధ్యతాయుతంగాను రూపొందించే విద్యా విధానమును రూపొందించి, అమలుపరచుటకు అత్యంతశ్రద్ధ వహించవలెను.

ప్రధాని నెహ్రూ వివరించినట్లు స్త్రీ పురుషులతో నిర్మితమైనది జాతి. జాతి యొక్క మంచి చెడ్డలు, అభ్యుదయ సౌభాగ్యములు స్త్రీ పురుషుల బాధ్యతా నిర్వహణమీద, ధర్మ, న్యాయసమ్మతమైన నడతమీద నాధారపడియుండగా, వారిని తీర్చి దిద్దవలసిన విద్యా విధానము యీనాడు తృప్తికరముగా లేకపోవడము ప్రతియొక్కరు గ్రమనించతగినది. ప్రజాహితాన్ని, శ్రేయస్సును ఉద్దేశించి ప్రస్తుతపు విద్యా విధానంలో జరుగాల్సిన సంస్కరణలు ఎంత త్వరలో అమలు జరిగితే అంత మంచిది.

జాతీయావసరాలను తీర్చడంకూడ విద్యా విధానంయొక్క లక్ష్యంకావాలి. జాతికి కావలసినది కూడు, గుడ్డ, నివాస వసతులుమాత్రంకావు. విజ్ఞానం, వినోదం, శాంతి సౌభాగ్యములు, బాధ్యతాయుతమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, హక్కులు, అవకాశములు, జాతీయావసరాలు. వానిని వివరించి, సమకూర్చకలిగిన విద్యా విధానం రూపొందాలి.

విశాల హృదయంతో, సద్భావ, సమరస సమైక్యతలతో స్త్రీ పురుషులు తమ స్వీయ సౌభాగ్యమును తీర్చిదిద్దుకొని ప్రపంచ కళ్యాణానికి తోడ్పడుట కనువైన విద్యా విధానము రూపొందగలదని ఆశిద్దాము.

# అభినందన

మద్రాసు కార్పొరేషన్‌కు మేయరుగా శ్రీమతి తారాచెరియన్ ఎన్నుకోబడిన సందర్భమున మేము హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాము.

శ్రీమతి తారాచెరియన్‌గారికి వర్గపార్టీ రాజకీయాల కతీతంగా కార్పొరేషన్ సభ్యుల సహకార సహాయములు లభించి నగర పరిపాలనా వ్యవస్థ పటిష్టమగుటయేకాక ప్రజాభిమాన పాత్రము కాగలదని ఆశిస్తున్నాము.



# కేనోపనిషదు


మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం :
డాక్టరు W. రాధాకృష్ణయ్య




ఉపనిషద్దుల విచారము మొదలిడి, శృతి యభిప్రాయములను గమనించిన వెనుక, వందలకొలది యిట్టి సమస్యలు, ఎదుర్కొనగలుగుచున్నాము. ఈ సమస్యల కన్నిటికిని ఏకకాలమున సమాధానము యత్నించుట వృథా. మనము విచారము సాగించు కొలది మన సమస్య లనేకములు వాటి కవియే తీరిపోయి, మన సందేహముల, యన్నిటిలో జ్ఞాన తేజస్సు, ఉపనిషద ఋషుల యనుగ్రహమున, జోరబడి, సందేహనివృత్తులు, కలుగుచుండును.

ఈ సృష్టికారణముచేత పరమాత్మకు ఎట్టిమార్పును, కలిగినదని వేదాంతము వొప్పుకొనుటలేదు. మనసు యొక్క విచిత్రమాయా గుణముచేత అద్వైత సత్య స్వరూపునందు, అసత్య బహుత్వరూపములు చూచుచున్నాము. బాటసారి అంధకార దోషముచేత పగ్గమును సర్పమని, కొయ్యతుండును, భూతమనియు భ్రమపడుచున్నాడు. ఈ సత్యమును మరుగుపరచు మనలోయుండు శక్తిని, మాయయని వేదాంతమున చెప్పుచున్నారు. ఈ విషయము మరల చర్చకు రాగలదు.

## మానవుని పతనము : వుద్ధారము:—

ఓంకార స్వరూపమే పరమాత్మ స్వరూపము. శుద్ధ, ఆనంద అనుభవ స్వరూపము, ఓం అనునది వుపనిషద్దు జ్ఞానసారసత్యము. జీవకోటుల కన్నిటికి మూలస్థానము. మన సర్వులలోనుండు జీవమూలాధారము. ఎట్టి అవస్థలు మార్పులు చెందని నిత్య సత్యము. మనలోనుండు నిజమైన "నేను" అను స్వరూపమది.

ఆ పరమ ఆనందపదవినుండు, మన జ్ఞానానంద స్వరూపమును మరచి, పరిమితికిలోనైన, అజ్ఞాన, దుఃఖస్వరూప మృత్యువును వెంటబెట్టుకొని, మానవుడైయున్నాము. ఈ దృశ్యపతనము కలుగుట ఎందువల్లనో, కనుగొనినయెడల, మన పూర్వస్థానముపొంద యత్నించుటకు మార్గము తెలిసినవారమగుదము.

నిజమైన పతనము మానవునకు కలిగినదనియే వేదాంతము వొప్పుకొనుటలేదు. "తత్త్వమసి" అని పలుమారు భోధించుటలో ఉపనిషదులు యే మాత్రమును, విరామము చెందుటలేదు. అట్లుండియు, నీవును నేనును సర్వులు, మన వ్యక్తి జీవనము, ఒక బలహీనత, మన దుఃఖములను, అనుభవించుచున్నాము. ద్వైతభావమేమన దుఃఖములను ఆవలింపజేయుచున్నది. ఆ దృశ్య ప్రపంచమును ప్రతి నిముషమును, మన జీవితకాలములో మనము, అనుభవించుచున్నాము.

అయితే ఈ యింద్రియ గోచరమగు, దృశ్య ప్రపంచము, సత్యముకాదని వేదాంతము ఘోషించుచున్నది. ఇది పరిమితికిగల దృశ్యము. దానికి అంత్యమున్నది. పగ్గములో సర్పముకనినయట్లే, ఈ ప్రపంచమంతయు సత్యమని మనము, నమ్ముచున్నాము. భయభ్రాంతునికి కొయ్యతుండునందు, భూతము సత్యముగా కనబడినయట్లే, యెండమావులయందు నీళ్లు నిజముగలేవు. ఉండునది యెండ మాత్రము.

కనుక నిత్యసచ్చిదానంద స్వరూపమొకటియే అస్తిత్వముగలది. ఈ దృశ్య ప్రపంచమున మన అజ్ఞానజనిత అహంకారమును, అసత్యమును, అభ్యాసము చేయుచున్నాము. ఇవన్నియు అసత్యము. ద్వైతమంతయు దుఃఖభ్రమ. ఏక అద్వితీయ, వస్తువు ఒకటియే సత్యమైనది.

అటులనే మన నిజస్వరూప జ్ఞానలేమిచే, అవిద్య

ఆవరించడమువల్ల, మన భ్రమలలో మునిగియున్నాము. ఈ భ్రమయెట్లు కలిగినది - అను ఈ సమస్య, మనలో కలుగుట, ఇప్పుడు న్యాయము. ఈ అనుమానము అన్వేషకులలో తొలగించుటకుగాను, వేదాంతమున, మాయ, యనునొకపదము ఉపయోగించియున్నారు.

మాయ యనునది, ఆ పరమాత్మయందనుస్యూతమై విభజింప నశక్యమైన యొక శక్తి. అగ్నియందుష్ణత్వము వలె, ఉష్ణములేని అగ్ని లేదు. అగ్ని లేని ఉష్ణత్వము లేదు. మాయ యనునది పరమాత్మయందు ఒక స్వతస్సిద్ధమైనశక్తి. అగ్నియే ఉష్ణము. ఉష్ణమే యగ్ని. అయిన యీ మాయావాదము శూన్యవాదముగాదు. ఏలన మాయ అనగా సంస్కృతమున "యామా-సా-మాయా". ఏది విచారించగా లేకపోవుచున్నదో అది మాయ.

ఈ మాయ యనునది, మన మనసులోనుండు నొక శక్తిచేత ఆ మనసే భ్రమకులోనైపోవుచున్నది. పగ్గమున పామును, కొయ్యన భూతమును, ఎడారిన యెండమావులను, లేని దృశ్యములను కనుగొనుచున్నది.

## మాయ : దృష్టాంతము:—

ఈ మాయ యనునది మనయొక్క శక్తి పూర్వక సహాయముతోనే, మనలను భ్రమింపచేయుచుండుట, వేదాంతమున సోమదత్తుడను - బాలుని - తండ్రికథ వల్ల, తఱచుగా ఉదహరింపబడుచుండును, ఆ కథ విషయమేమియన:—

ఒక నూతన బ్రహ్మచారి, యాత్రలు సేయుచు, చాలా డస్సినవాడై ఒక వేడి మధ్యాహ్నకాలమున, సూర్యరశ్మి తపింపజేయుచుండగా, గంగానదియొడ్డున నొకచెట్టు నీడలో కొంత చదరపు స్థలముండ, అచ్చట కొంత విశ్రాంతికొరకై పరుండెను. ఆ స్థలము ఒక చదరపు బండగా నుండెను. అతనికి నిద్ర కూరుకవచ్చు సమయమునకు సరిగా, యిద్దరు పడుచులు, నీటికై వచ్చి, గంగా జలమును కడవలతోనింపి, నెమ్మదిగా వెళ్ళిరి. ఈ దృశ్యమును చూచిన బ్రహ్మచారికి, మనసులో ఒక ఆలోచన పరంపర ఆరంభమాయెను.

ఆ ఇరువురిలో నేను నొక పడచును వివాహమాడిన ప్రమాదమేమి, తప్పక పెండ్లిచేసుకొనవలయును. ఒక చిన్న ఇల్లు, మూడరలలో నుండునది కావలెను. నేను కఠినశిక్షణాపరుడైన భర్తగా నుండవలెను. నా పొలములో పైరు పంటలు పెంచుకొని, సంతోషములో, తృప్తితో జీవనము జరుపగలను. అపుడు, ఒక చిన్న ముద్దులాడు కొమార్డు కలుగును. వాని పేరు సోమదత్తుడని నామకరణము చేసెదను. మేము ముగ్గురు ఒకే పడకపై నిదురింపగలము. కానీ, పడకపైన నా బిడ్డకు జాగా యున్నదా. (భార్యతో) దేవీ! బిడ్డకు కొంచెము జాగాయిమ్ము. లేకున్న, బిడ్డ క్రిందపడును. (భార్య) దేవుడా! నేనెక్కడ జరుగగలను. ఎక్కడ జాగాయున్నది. నీవు ఆ ప్రక్కకు జరుగుము. (భర్త) సరేనని జరుగును. దభాలను శబ్దము. పాపము సోమదత్తుని తండ్రి పరుండియుండిన బండపై కొంచము జరిగెను. బండ సన్నగా యున్నందున, జారి గంగాజలములో పడెను. మెలకువ వచ్చెను. ఈదుకొని బ్రహ్మచారి గట్టుచేరెను.

మిత్రులారా! ఈ బ్రహ్మచారి పతనమునకు కారణమేమి, మెలకువ వచ్చిన పిమ్మట, అతడు తన భార్యా బిడ్డలను, ఎక్కడ కలసికొనగలడు.

ఆ బ్రహ్మచారి సోమదత్తుని ప్రపంచమును తనలోనే సృష్టించుకొనెను. దానితో తదాత్మ్యము పొందెను. ఆ స్వప్న జీవనము నిజమని నమ్మెను. దానివల్ల తనకు పతనము సంభవించెను.

ఇదే రీతిని, మన నిజస్వరూపము, శుద్ధనిత్య ఆత్మ స్వరూపము. ఈ ఆత్మ, స్వప్నములో తన్ను తాను మరచి, తన సంసారమునే నిజమని యనుభవించుచున్నది. మేల్కొనుడు! ఈ స్వప్న సంసారానుభవమను సన్నని (బండ) పడకనుండి **అవతలికి**

ప్రొల్లుడు. శృతులను గంగాజలమున స్నానము చేయుడు. తెలివియను జాగ్రతావస్తను గాంచుడు. ఈ ఆసుర స్వప్నమును ఒక్కపెట్టున అంత్యము చేయుడు, ఈ సోమదత్తుని తండ్రి యనుభవించిన సంసారజీవితమునకును, గంగలో చివర అతని పతనమునకును, కారణశక్తి మాయ. తనలోలేనివస్తువు వున్నదని, యదితన స్వరూపమని, తలచుటయే, మాయ:—

ప్రపంచమున ఈ మాయ, మూడు గుణములతో యున్నది. సత్వము, (అకర్తృత్వము). రాజస, (కర్తృత్వము). తామస (సోమరితనము లేక లికర్తృత్వము). ఈ మూడు గుణములు ఎప్పుడును అలజడిలో నుండును. వీటియొక్క తారతమ్యములు, ఒక వ్యక్తికి, మరియొక వ్యక్తికి భేదముగా నుండును. ఒకే వ్యక్తిలో వివిధ సమయములలో, వివిధ తారతమ్యములుగా నుండును.

శుద్ధసత్వగుణ ప్రధాన మాయయందు, ప్రవేశించునపుడు, ఆ సత్యస్వరూప పరమాత్మ, నిత్యజ్ఞాన తేజస్వరూపుని, పూర్ణశుద్ధ ప్రతిబింబము, గోచరమగును. ఇది దైవీగుణమని చెప్పుదురు. మలిన సత్వప్రధాన రూపమందు, ప్రకాశించునపుడు, అశుద్ధమలావృత ప్రతిబింబము గోచరమయి, జీవుడను, నామమున వ్యవహరింపబడుచున్నాడు.

**దైవాంశము:—**

ఈ దైవాంశము విశాల ప్రపంచమున మూడు ముఖ్యమైన ఫలములుగా మనలను, ఆవరించుకొని, ప్రదర్శన మిచ్చుచున్నది.

ప్రతి క్షణమును ప్రపంచములోని వస్తువులు (సృష్టి) జన్మము నెత్తుచుండుట, చూచుచున్నాము. ప్రతిక్షణమును, వస్తువులు, (అంత్యమును) మరణమును పొందుట గాంచుచున్నాము. ఈ అగోచర జనన మరణములకు మధ్య, వస్తువులు అస్తిత్వము గాంచి, వ్యవహరించుట, చూచుచున్నాము ...

ఈ మానవుని ఆవరించియుండు మూడు విధశక్తులను సాధారణ మానవుడు గ్రహించుటకై సృష్టికర్త బ్రహ్మ, పోషక విష్ణువు, వినాశకారి శివుడు అని మనము వ్యవహరించుచున్నాము.

ఒక కుండను తయారుచేయుటకు కుండయొక్క గుణములు, ఆకారములు కుమ్మరి ముందుగా తెలిసి యుండవలయును. సృష్టికర్త సృష్టియొక్క రీతి దానినెట్లు సృష్టించవలెనో, తెలిసియుండవలయును. ఇందుకై "బ్రహ్మ" దేవునికి శ్రీ సరస్వతి జ్ఞాన దేవతను వివాహము చేయబడియున్నది. సంరక్షకునికి సంరక్షించు శక్తి యుండవలయును. నిరుపేద సంసారభారమును మోయలేదు. కనుక సంపదశక్తియైన శ్రీ లక్ష్మీదేవిని, సంరక్షకరుడైన విష్ణువునకు వివాహముజేయబడినది. అలాగే, వినాశకారుడైన శివునకు నశింపచేయదగు వస్తుసముదాయ ఆవరణముండవలెను. ప్రపంచము ఒకటి లేకపోయిన నశింపజేయుశక్తి కానరాదు. అందుచేతనే ప్రకృతి స్వరూపిణియైన ఉమాదేవి ఈశ్వరుని పత్నియై తోడ్పడుచున్నది.

ఈ త్రిమూర్తుల శక్తులు ప్రత్యేకములైనవి, వేరువేరైనవి. మరి నారీస్వరూపములుకూడా వివిధమైనవియని స్పష్టమగుచున్నది. వీరు మువ్వురు, ఏకస్వరూపులు, అద్వైత స్వరూపములని పురాణములు ఘోషించుచున్నవి. కానీ ఆ సూక్ష్మఘోష బహు శిక్షణపొందిన తీవ్రమేధావులకుగానీ, ఇతరులకు వినబడుట చాలా కష్టము.

(సశేషము)

# సోవియట్ దేశంలో విడాకులు

ఎస్. జిల్



సోవియట్ దేశంలో విడాకుల చట్టం గురించి తెలుసికోనదలచినవారు తరుచు వివాహాలూ, విడాకుల సమస్యలగూర్చి ప్రశ్నిస్తూవుంటారు.

1944 జూలై 8-వ తేదీన సోవియట్ ప్రభుత్వం కుటుంబ ప్రయోజనాలను పరిరక్షించడంగురించి ఒక ప్రత్యేకమైన శాసనం చేసింది.

వివాహం కేవలం ఒక వ్యక్తిగతసమస్య మాత్రమేకాక, అది దేశ జీవితంతో కూడా సన్నిహితంగా ముడిపడివున్నదనే సూత్రం మీద యీ శాసనం ఆధారపడి వుంది. దంపతుల ప్రాథమిక హక్కులూ బాధ్యతల జాబితాకూడా యీ చట్టంలో పేర్కొన బడ్డాయి.

## ముఖ్య కారణాలు

ఇటీవల విడాకుల సంఖ్య బాగా తగ్గిపోయిందని చెప్పాలి. విడాకులిచ్చుకున్న దంపతులు తిరిగి తమ వైవాహిక జీవితాన్ని ప్రారంభించిన సందర్భాలు అనేకం వున్నాయి. అయినా, విడాకులకు గల కొన్ని ప్రధానకారణాలను పరిశీలిద్దాము.

చాల సందర్భాలలో, వధూవరులు సుస్థిరవైవాహిక బాంధవ్యానికి తగు ప్రాతిపదిక లేకుండా తొందరలో వివాహమాడినప్పుడు విడాకులిచ్చుకోవడం జరుగుతుంది. తాత్కాలిక ఉద్రేకంలోపడి వివాహమాడే యువతీయువకులీ తరగతిలోకి వస్తారు.

ఆరోగ్య కారణాలవల్ల కొంతమందికి సంతానం కలగకపోయిన సందర్భాలలో విడాకులిచ్చుకోవడం జరగవచ్చును. యువతీయువకులు తల్లి తండ్రులతో కలసి వుండేటప్పుడు వారితో పడకపోవడం కొన్ని సందర్భాలలో విడాకులకు కారణమవుతుంది. ఒకొక్కప్పుడు దంపతులు "స్వభావ వైరుధ్యం కారణమంటారు.

## రాజీ ప్రయత్నాలు

విభేధాలు చాలకాలమై వుంటున్నప్పుడు దంపతులు చివరికి విడాకులకు వస్తారు. భార్యగాని భర్తగాని దరఖాస్తు వ్రాసి ప్రజాన్యాయస్థానానికివ్వాలి.

అయితే న్యాయశాస్త్ర దృష్ట్యా విడాకుల కేసు విచారణ ఎలా జరుగుతుంది? మొదట స్థానిక ప్రజాకోర్టులో న్యాయమూర్తికీ, భార్యభర్తలకూ మధ్య చర్చ జరుగుతుంది. ఈ చర్చలక్ష్యం రాజీ కుదర్చడమే. రాజీప్రయత్నం విఫలమైనప్పుడు, న్యాయవిచారణ ప్రారంభమవు

తుంది ; విచారణ బహిరంగంగా, న్యాయ మూర్తిముందూ, ఇద్దరు ఎసెసర్లసమక్షం లోనూ జరుగుతుంది. బహిరంగ విచార ణకు చాల ప్రాముఖ్యంవుంది.

దంపతులు తమలోపాలనూ, తప్పు లనూ సరిదిద్దుకోడానికి తోడ్పడం న్యాయ స్థానంయొక్క ప్రధానకర్తవ్యం. తమపై జరిగిన ఆరోపణలను ఖండించడానికి సాక్షు లను పిలుచుకునే హక్కు భార్య భర్తల కుంది. చాలవరకు కేసులలోసమాధానం కుదిరిపోతూవుంటుంది. కాని ఒక్కొక్క సారి అటువంటిరాజీ అసాధ్యమవుతుంది. అలాంటప్పుడు న్యాయస్థానం, సమా ధానం కుదరలేదనీ విచారణ సమాప్త మయిందనీ మాత్రమే ప్రకటించి ఊరు కుంటుంది.

తరవాత భార్యభర్తలు పట్టణన్యాయ స్థానానికి పంపబడతారు. పట్టణన్యాయ స్థానంలో కేసు విచారణ ప్రారంభం కావడానికి ముందు కొంత కాలం గడుస్తుంది. ఒక్కొక్కప్పుడు, ప్రజా న్యాయస్థానంలో పరిష్కరింపబడజాలని కేసు పట్టణన్యాయ స్థానం వరకూ పోదు; ఎందుకంటే దంపతులు మళ్లా కలసి తమ జీవితం గడపడానికి నిశ్చయించుకోవచ్చును.

పట్టణ న్యాయస్థానంలో జడ్జికీ, దంప తులకూ మధ్య మళ్లీనిర్మోహమాటంగా చర్చ జరుగుతుంది. భార్యభర్తలు అంగీ కారానికి రాకపోతే మళ్లీ కేసు బహిరంగ విచారణ జరుగుతుంది. ఉభయపక్షాలూ చెప్పుకోవలసినది చెప్పుకుంటారు. అవసర మైతే సాక్షులు రప్పించబడతారు. విడిపోవాలనే నిర్ణయం గట్టిగావుందా లేదా అని కనుగొనడం యీ విచారణ ఉద్దేశం. ఒకవేళ భార్యగాని భర్తగాని తమ మనసు మార్చుకోదలచుకోనవచ్చు. వారు, అలా దలచుకోనప్పుడు విడాకులు అనుమతించ బడుతుంది. భార్యభర్తలలో ఒకరు విడాకులకు వ్యతిరేకమైతే సాధారణంగా చర్చ తీవ్రంగా జరుగుతుంది ; విడాకుల దరఖాస్తుకు సరియైన కారణముందో లేదో న్యాయస్థానం నిర్ణయించవలసి వుంటుంది.

దంపతులు తమ కేసు విచారణ రహ స్యంగా జరగాలని కోరవచ్చును. విచార ణలో భార్య భర్తల దాంపత్య జీవితానికి సంబంధించిన రహస్య విషయాలువచ్చే టట్లువుంటే న్యాయస్థానమే విచారణ రహస్యంగా జరగాలని నిర్ణయించవచ్చును.

## తల్లి తండ్రుల అభిప్రాయం

తల్లిదండ్రుల, మిత్రుల అభిప్రాయం అత్యంత ముఖ్యమైనదిగా పరిగణించబడు తుంది. ఒకసారి ఒక తల్లి కోర్టుకువచ్చి తన కుమార్తె కోరుతున్న విడాకులను అనుమతించవద్దని కోరింది. తన కుమార్తె

ఒక తాత్కాలిక ఉద్రేకానికిలోనై తన సౌఖ్యాన్ని బలియివ్వనున్నదని ఆమె అభిప్రాయపడింది. న్యాయస్థానం విడాకుల దరఖాస్తును త్రోసి పుచ్చింది. (ముఖ్యంగా యీ దంపతులకు బిడ్డలున్నారు) కాని ఒక వేళ భార్యాభర్తలు పట్టుబడితే?

అట్టువంటి సందర్భాలలో కోర్టువారు, భార్యాభర్తలు తీసుకుంటున్న నిర్ణయం గురించీ అందువల్ల రాగల పరిణామాల గూర్చీ హెచ్చరిస్తూ విడాకులకు అనుమతిస్తారు. అయితే, భార్యభర్తలు తాము విడిపోడానికి ఒప్పుకున్నంత మాత్రాన కోర్టువారు ఒప్పుకోనవసరంలేదు, అప్పుడైనా విడాకులకు అనుమతిని నిరాకరించవచ్చును.

మొత్తంమీద అటువంటి కేసుల్లో సోవియట్ న్యాయవిచారణ పై విధంగా వుంటుంది. దీనివల్ల తేలే విషయమేమిటంటే భార్యభర్తలు తమ వైవాహిక జీవిత బాధ్యతలను నెరవేర్చుకునేందుకు వీలుగా వారి దాంపత్యజీవితం సుఖంగా గడవడానికి తోడ్పడేందుకు అన్ని ప్రయత్నాలు జరుగుతాయి.

'టాస్'

—:o:—

## వజ్రాలను వెతికి తీసేయంత్రం

యాకుటియాలో అపారమైనవజ్ర సంపదలున్నాయి. వాటిని పైకి తియ్యడానికి ఒక లెనిన్‌గ్రాడ్ ఫాక్టరీ యిటీవల కోయింట్ జెస్ – లుమినిసెంట్ ఆటోమేటిక్ యంత్రాలను తయారుచేసింది. ఇవి రాయిలోంచి చిన్న చిన్న వజ్రపు ముక్కలను పైకి తీస్తాయి. ఇంతకు పూర్వం వజ్రాలను యిలాతీసేవారు; కేంబ్రియన్‌రాయిని తెచ్చి, చిన్న చిన్న ముక్కలుగాకొట్టి కార్మికులు వాటిని ఒక చీకటిగదిలో ఎక్స్‌రే తీసేవారు. అందులో వజ్రాలు మెరియగా వాటిని పైకి తీసేవారు.

ఇప్పుడు కనిపెట్టబడిన కొత్తయంత్రం మనిషిసాయంలేకుండానే రాయిలోంచి వజ్రాలను తీస్తుంది. రాయిముక్కలుగా కొట్టబడి యీ యంత్రం పైనుండే దొప్పలో వేయబడుతుంది. దానిమీద ఒక ఎక్స్‌రే దీపం వెలుగుతూవుంటుంది. దాని కిరణాలలో వజ్రాలు మెరుస్తాయి. ఈ కాంతి ఒక ఫోటోసెల్‌మీద పడగా, అది, ప్రత్యేకంగా అమర్చబడిన కత్తులను నడుపుతుంది. ఇది వజ్రాలను పైకితీస్తాయి.

—

# భార్య

"శార్వాణి"





వెంకట్రావు కాళ్ళీడ్చుకుంటూ యింటికి వచ్చేసరికి ఎనిమిది గంటలు అయింది. సైరన్ కూత విన్పిస్తోంది. నిశ్శబ్ధంగావున్న చీకటిని చీలుస్తూ, విరామం లేకుండా బయటవాకిట్లో మునిసిపాలిటీ లాంతరు కాలుతోంది. దగ్గరగా జారిగిలవేసివున్న తలుపులను తెరచి, వెంకట్రావు గదిలోనికివచ్చి చూశాడు. గదంతా చీకటిగావుంది. దీపం గదిలోలేదు. కమల కూడలేదు. వంటింట్లోకివచ్చి చూశాడు. కమల పొయ్యి రాజేస్తుంది. ఊదుల గొట్టంతో ఎంత వూదినా కట్టెలు అంటుకోవడంలేదు. వంటింటి నిండా పొగ. ఆ పొగంతా అతని కళ్లలోనికి పోయేసరికి, అతడు ఒక్క క్షణం అచ్చట నించోలేక పోయాడు వెంటనే బయటకువచ్చి గట్టిగా అరచాడు. వంటపనిలో నిమగ్నురాలైన కమల, అంతవరకు అతని రాకను గమనించలేదు. అతని మాట విన్పించేసరికి త్రుళ్లి పడింది. గొట్టాన్ని అచ్చటపారవేసి, భయపడుతూ బయటకు వచ్చింది. వెంకట్రావు మండి పడుతున్నాడు.

"మధ్యాహ్నంనుంచి ఏ గుర్రానికి పళ్లు తోముతున్నావు. ఇప్పుడెంత అయిందో తెలుసా? ఎనిమిదిగంటలయింది. ఇంతవరకు నీవు పొయ్యిరాజేయలేదు. ఎప్పుడు వండుతావు? ఎప్పుడు అన్నం పెడతావు? ఆఫీసునుంచి ఆకలితోవస్తే, వేళకు కాస్త భోజనానికి నోచుకోలేనపుడు, పెళ్ళిచేసుకున్నందుకు ఉపయోగం ఏముంది?" పళ్లు పటపట కొరుకుతూ, ఎక్కడలేని కోపాన్ని తెచ్చుకొని, సముద్రకెరటాలులాగ పరవళ్లు త్రొక్కుతూ, గట్టిగా అరచాడు. కమల గుమ్మం ప్రక్కగా తలవొంచుకొని నిలబడి, నిశ్శబ్ధంగా వుండిపోయింది. ఆమె మౌనం, అతనికి మరీ వెర్రిగంగిర్లు ఎత్తించింది.

"గుడ్లగూబలాగ గుడ్లు అప్పగించి చూచే బదులు సమాధానంచెప్పి ఏడ్వకూడదూ." ఆమెవంక కండ్లెర్రజేసి, తీక్షణంగా విలోకించాడు. ఆమె ఏదో చెప్పడానికి ప్రయత్నంచేసి, చెప్పలేకపోయింది. ఆ సమయంలో ఏమిచెప్పినా, అతడు రెచ్చిపోతాడు. మెదలకుండా వూరుకోవడమే మంచిదిగా తోచింది. న్యాయం ఆమెపట్లవున్నా, ఆమె సమాధానం అతనికి రుచించదు. తన మాటమీద తను నిలబడి అర్థం లేకుండా వాదిస్తాడు. ఆమెలో సహనం సన్నగిల్లలేదు కాబట్టి అతని మనస్సు నొచ్చనివ్వకుండా చేయడానికి ప్రయత్నం చేస్తూంటుంది. ఆమె మనస్తత్వాన్ని, అతడు కనీసం మనశ్శాంతిగా వున్నప్పుడైనా అర్థంచేసుకోడానికి ప్రయత్నంచేయడు. వణుకు, అణుకువతో నిలబడివున్న ఆమె అంతర్యంలో ఆవేదన తెలుసుకోడు. అతడు న్యాయం మీద తిరుగుబాటుచేసినపుడు, ధర్మాన్ని ధిక్కరించి నడిచినపుడు, ఆమె మంచితనం అతన్ని క్షమిస్తుంది కాని అతని ప్రవర్తన మారడంలేదు. అతనిలో పరివర్తన రావడంలేదు.

"పెళ్లయి రెండు సంవత్సరాలైంది. వేళకు కడుపునిండుగా భోజనం పెట్టినరోజు చూపించు. నన్నీవిధంగా బాధపెట్టుతున్నందుకు, నిన్నేమిచేయాలో నా కర్థంకావడంలేదు. మధ్యాహ్నం నుంచి ఏంచేస్తున్నావు?"

అతనికోపం చల్లారలేదు. అతనికి కోపం పెరిగిన

కొలది, ఆమెకు 'శాంతం' అధికమౌతుంది. ఆమె పెదాలు వణుకుతున్నా, హృదయం భయంతో బెదురుతున్నా, క్షమ ఆమెతో క్షీణించలేదు.

"విన్పించడంలేదా? ఎవరికి చెప్పుతున్నాననుకుంటున్నావు. నాకు మతిపోయి వాగుతున్నాననుకుంటున్నావా? నన్ను రెచ్చకొట్టడం నీ కిష్టం అనుకుంటాను. అసలు నిన్ను అనవలసిన పనేముంది? ఆ రోజు నేను చెప్పినప్పుడు మా అమ్మ వింటే, యిన్ని బాధలు ఎందుకు వుండేవి?"

ఆఖరి వాక్యం అతడు చాలసార్లు అన్నాడు. ఆ విధముగా అనడం అతనికి కొత్తకాదు. ఒక రోజు రాత్రి పుచ్చపువ్వులాగ వెన్నల విరగాస్తున్నప్పుడు, కాచిన వెన్నలాగ యవ్వనం మరుగుతున్నప్పుడు, చందమామ ఆమెనుచూచి వెక్కిరించింది. అంతకు ముందే అతడు ఘర్షపడి వెళ్ళిపోయాడు.

"లేదు. జీవితానికి సుఖంలేదు" అతడు తిరస్కరించి వెళ్లుతున్నప్పుడు, కాళ్ళమీదపడి, ఏడ్చింది. కన్నీరుతో పాదాలను తడిపింది. అతని హృదయం కదలలేదు. అర్ధరాత్రి వంటరిగా వదలివెళ్ళిపోయాడు. అతడు చీకటిలో ప్రయాణంచేస్తున్నాడేమో అని భయపడింది. కిటికీ తలుపులు వేసి, గదిలో వంటరిగా కూర్చుని, ఆలోచిస్తూనేవుంది. తెల్లవారిన తర్వాత, వెంకట్రావు నీరసంగావచ్చి, మంచంమీద కూర్చున్నాడు. మళ్ళావెళ్ళి కాళ్ళమీదపడి విలపించింది.

"మీరు కోరుకుంటున్న సుఖం నా వల్ల లభ్యం కావడంలేదని అనవసరంగా మీరు బాధపడుతున్నారు. రాత్రిళ్లు తిరిగి, మీ ఆరోగ్యాన్ని పాడు చేసుకోకండి. మీరు వెళ్తున్న చీకటిలో వెలుతురులేదు."

అతడు విన్పించుకోలేదు. నిర్లక్ష్యంగా తూలనాడి, కళ్ళుమూసుకొని నిద్రపోయాడు.

జరిగిన సంఘటనలు మదిలో మెదిలేసరికి, ఆమె త్రుళ్ళిపడింది. లోపలనుంచి వస్తున్న దుఃఖాన్ని, బయటకు కన్పించనీయకుండాచేసి, వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"ఎంత నిర్లక్ష్యం! ఎంత గీర్వాణం. అడిగిన దానికి సమాధానం చెప్పడానికి నీకు ఓపికలేదన్నమాట. మూడు పూటలు తింటున్న అన్నమంతా ఏమవుతుంది? నీ వంట అవసరంలేదు. నీవు అవసరంలేదు." గబగబా బయటకు నడుస్తున్న అతనికి అడ్డుగావచ్చి నిలబడి, కళ్ళలోపడుతున్న ముంగురులను పైకెగదోసి, అతని కళ్ళలోనికి జాలిగా చూచింది.

"కట్టెలులేవని మీరు వెళ్ళేముందు చెప్పాను. మీరు తెస్తారని యింతవరకు చూశాను. ఎంతసేపటివరకు రాకపోతే అరగంటముందు బేడపెట్టి కట్టెలు తెప్పించాను." మెల్లగా ఝుడుస్తూ ఝుడుస్తూ అంది.

"నెలకింకా నాల్గురోజులువుంది. మూడు సలకలు కట్టెలు అప్పుడే అయిపోయాయా! అసలు నీకు కట్టెలను సరిగా కాల్చడం తెలిస్తేగా! యింత చిన్న వయస్సులో నిన్ను కట్టుకోవడంవల్ల యిన్ని అవాంతరాలు సంభవించాయి." అతడు మామూలు పాట మొదలుపెట్టాడు.

"ఒక అరగంటలో పూర్తిచేస్తాను. ఎక్కడికి వెళ్ళకండి." బ్రతిమాలుకొంది కళ్ళను వత్తుకుంటూ. దీనంగా అతనివంక మరియొకసారి చూచింది. అతడు విన్పించుకోలేదు. ఆమెను తప్పించుకొని, ముందుకు సాగిపోయాడు.

"ఇటు చూడండి. ఆలశ్యంగా వంటచేయడం తప్పే. ఈ విషయంలో నా తప్పని ఒప్పుకుంటున్నాను. నన్ను ఎన్ని తిట్టినా, కొట్టినా సహిస్తాను. మీరు నన్ను క్షమించకపోయినా బాధపడను. అన్నం తినకుండా మాత్రం వెళ్ళకండి." వీధి గుమ్మం దగ్గరకువచ్చి, భర్తను పిల్చింది. అతడు వెనక్కితిరిగి అయినా చూడలేదు. అతడు కన్పించేవరకుచూచి, సందుమలుపు తిరిగిన వెంటనే, వీధి తలుపులువేసి, లోపలకు వెళ్ళిపోయింది. బల్లమీద నవ్వుతూ నిల

బడివున్న 'కృష్ణుని' విగ్రహం కన్పించింది. ఒక్కసారి బావురుమని ఏడ్చింది

"నా తప్పేముందని నాకీశిక్ష? పరమాత్మా! వారికి నా వల్ల బాధ మిగులుతున్నప్పుడు, నన్నింకా ఎందుకు బ్రతికిస్తున్నావు?" ఆమె చాల సేపటి వరకు విగ్రహంముందు నిలబడిపోయింది. వంటిల్లు విషయం జ్ఞాపకంవచ్చిన వెంటనే, అచ్చటనుంచి కదిలి వంటింట్లోనికి వచ్చింది. కట్టెలు అంటుకున్నాయి. తపాళాలోని ఎసరు మరుగుతోంది. మండుతున్న కట్టెలను నీళ్ళతో ఆర్పి, పొయ్యిమీద వున్న తాపాళా దించేసింది. వంటిల్లు గొళ్ళెంపెట్టి గదిలోనికివచ్చి, అద్దం ముందు నిలబడింది.

అద్దంలో పడుతున్న ప్రతిబింబంలో, తన మనస్సును చూడాలని ప్రయత్నంచేసింది. అద్దంలో ఆమెకు కన్పించేది తన స్వరూపం మాత్రమే! కళ్ళ వెనుక బాధ, హృదయంచాటున నిరాశ, మనస్సు మాటున నిస్పృహ, ఆమె అందాన్ని మాయంచేస్తున్నాయి. శుష్కించిపోయిన శరీరం, పీక్కుపోయిన మొహం, పాలిపోయిన పెదాలు, లోతుకుపోయిన కళ్లు, కమల ఒక్కసారి కంపించుకొనిపోయింది. బరువుగా బాధ లోపల మూల్గింది. ఆమెగురించి అతడేమి అడగడు. అతనికేమిపట్టనట్లు మెదలకుండా వూరుకుంటాడు. ఆమె అన్నం తింటున్నది, లేనిది, ఆరోగ్యంగా వుంటున్నది లేనిది, ఏమి గమనించడు. తన భర్త కాస్త దగ్గుతేచాలు, "అమ్మ బాబోయి!" అని గుండెలు బాదుకుంటుంది. జలుబుచేసి జ్వరం కొద్దిగావస్తేచాలు, త్వరగా తగ్గించమని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటుంది. అతడు బాధపడుతున్నప్పుడు, తన ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయకుండా, భర్తకోసం రాత్రింబవళ్ళు సేవచేస్తుంది.

కమల అచ్చటనుంచివచ్చి, మంచంమీద వత్తిగిలింది. పెళ్లిరోజు తీయించుకున్న ఫోటో ఎదురుగుండా కన్పించింది. ఆమె ఆ శుభసమయంలో అతని ప్రక్కగా నవ్వుతూ నిలబడింది. ఆ ఫోటో చూస్తున్నప్పుడు అతని హృదయానికి దగ్గరగా చేరి, జీవితంలో భాగస్వామిఅయి, అలాగే ఎప్పుడూ నవ్వుతూ గడిచిపోవాలని ఆశపడేది. ఇప్పుడు తన ఆశలన్నీ అడియాశలయ్యాయి. తప్పించుకొని తిరుగుతున్న, తనభర్తను తిరిగి మానవునిగా మార్చాలనే ప్రయత్నం చేసినప్పుడు, ఆమెకు చీకటి మిగులుతుంది. ఆ చీకటిలో ఆశనలిగి, నిరాశగామారి నిర్వేదిస్తుంది. ఆలోచిస్తూ కళ్లు మూసింది. కొంచెంసేపటికి బయట తలుపులు తడుతున్న శబ్దంవిన్పించేసరికి లేచి తొందరగా తలుపులు తీసింది. అతడు ఏమిమాట్లాడకుండా వచ్చి, మంచంమీద కూర్చున్నాడు. అప్పటికి చాల ప్రొద్దుపోయింది. బయట ఏమిశబ్దం విన్పించడం లేదు. లైటు ఆర్పి పక్కమీద ప్రక్కగా వొరిగి కళ్లు మూశాడు.

వీధి తలుపులు గడియవేసి, కమల మంచందగ్గరకు వచ్చినించుంది. అతడు అటువైపుకి ముఖంపెట్టి, నిద్రపోతున్నట్లు నటిస్తున్నాడు. చెక్కిళ్ళమీదుగా కారుతున్న కన్నీటిని పమిటి చెంగుతో వొత్తుకొని, బాగా దగ్గరగావచ్చి వొంగి చూచింది. అతని కళ్లు తెరచేవున్నాయి.

"నా తప్పులుంటే క్షమించమని ప్రార్థిస్తున్నాను. నేనీ రోజు చేసినపొరబాటుకు చాలబాధపడుతున్నాను. ఇకనుంచి చాల జాగ్రత్తగా వుంటాను. మీరు వచ్చే వేళకు వంటచేసి వుంచుతాను" అతని చిబుకాన్ని తనచేతితో పట్టుకొని తనవేపుకి ముఖం తిప్పి, దీనంగా అతనికి కళ్లలోనికి చూచి బ్రతిమాలుతుంది. అతడామెచేతిని విసురుగా విదిలించివేసి, విసుక్కుంటూ ప్రక్కకుతిరిగాడు.

"ఇటుచూడండి, పెళ్ళి రోజున అగ్నిముందు మీరు చేసిన బాసలన్నీ మరచిపోయారా! అరుంధతి నక్షత్రాన్ని చూచి నన్నుకూడా చూడమనిచెప్పి, మీ మనస్సులో మీరు అనుకున్న విషయాలన్నీ విస్మరించారా" ఆమె అచ్చటేనిలబడి నిర్లిప్తంగా చూస్తోంది.

"నన్ను బ్రతకనీయదలచుకుంటే, ఇచ్చటనుంచి తక్షణం వెళ్లు, పుండుమీద కారం చల్లి, మనస్సును రగిలించదలచుకుంటే, నీయిష్టం" దురుసుగా లేచి కూర్చుని, దీనంగా నిలబడివున్న ఆమె వైపు తీక్షణంగా చూశాడు.

"అవును. మిమ్మల్ని కష్టపెడుతున్నాను. మీరు సుఖంగా వుండండి. అచ్చటనుంచి వసారాలోనికి వచ్చి, చింకిచాపపరచుకొని, ఆలోచిస్తూ నిద్ర పోయింది.

వెంకట్రావు లేచేసరికి, కమల యింకా నిద్ర పోతూనేవుంది. అతడు మండిపడుతూ వసారాలోనికి వచ్చి, పరిశీలించాడు వళ్లుతెలియకుండా నిద్రపోతున్న కమలను తట్టి లేపాడు. ఆమె వళ్ళు వెచ్చగా కాలిపోతుంది. కమల మెల్లగా కళ్లుతెరచి చూచింది. కోపంగా వున్నభర్తనుచూచి హడలిపోతూ లేవబోయింది.

"తెల్లవార్లూ చలిలో చావకపోతే ఇంట్లో వచ్చి పండుకోకూడదూ? చలిలో నిద్రపోతే జ్వరంవస్తున్నదన్న సంగతికూడా తెలియదునీకు. నీవు మనిషివా? పశువువా?" ముఖం మరియొకవైపుకి పెట్టి, యిష్టమొచ్చినట్లు దూషించాడు. ఆమెలేవడానికి ప్రయత్నంచేసింది. చాలనీరసించి పోయింది. విపరీతమైనతలనొప్పి. మెల్లిగాలేచి నొప్పినిలెక్క చెయ్యకుండాగోడను ఆధారంగా చేసుకొని వంటింట్లోకి అతికష్టంమీద వెళ్ళింది. ఇదంతా చూస్తూచూడనట్లు నటిస్తున్న అతడు, అచ్చటే నిర్లక్ష్యంగా నిలబడిపోయాడు. భళ్లుమని శబ్దంవిన్పించేసరికి, అతడు వంటింట్లోకివచ్చి చూశాడు. ఆమె స్పృహతప్పి పడిపోయివుంది. నొసటిమీద కుడికన్ను కొంచెం పైన రక్తం చమురుతోంది. ముహంమీద కాచిని చన్నీళ్లు చల్లాడు. ఆమె కళ్లుతెరచిచూచింది.

"జ్వరం వచ్చినసంగతి తెలుసుండికూడా నిన్నెవరువంటింట్లోకి వెళ్ళమన్నారు? జ్వరాలను ముదరపెట్టుకొని తర్వాత మా ప్రాణాలు తీయడానికా! లేచి గదిలోనికి వెళ్ళి పడుకో!" జ్వరంతో బాధపడుతున్న ఆమెను యింకా హింసిస్తూనేవున్నాడు. లేవలేని పరిస్థితిలోవున్నా ఆమెను మంచం వరకు తీసుకొని వెళ్లకుండా, అచ్చటనుంచి నిర్దాక్షిణ్యంగా వెళ్ళి పోయాడు. నిమ్మదిగాలేచి కనుబొమలపై కారుతున్న నెత్తురును తుడుచుకొని, గోడలనుపట్టుకొని గదిలోనికివచ్చి, మంచంమీద వాలిపోయింది. ఒకగంట పోయిన తర్వాత మందుతీసుకొనివచ్చాడు.

"వచ్చే జీతాలు మందులకే సరిపోతే ఇహ బ్రతికినట్లే! మనంజాగ్రత్తలోవుంటే జ్వరాలు వస్తాయా?" మందు సీసా అచ్చటపెట్టి, ఆఫీసుకి వెళ్తానని చెప్పి వెళ్ళిపోయాడు. కమల కళ్ళుతెరచి చూచింది - ఎవరూ కన్పించలేదు. ఇంట్లో ఎవరూ లేరు. జ్వరం తీవ్రంగావున్నా వంటరిగావదలిపెట్టి వెళ్ళిపోయాడు. ఒక్క నిమిషం భర్త బాధపడుతుంటే భార్య హృదయం తల్లడిల్లి పోతుంది. అతన్ని కనిపెట్టుకొని, స్వస్థత చేకూరేవరకు అహర్నిశలు సేవ చేయడానికి ఎంతమాత్రం వెనుకాడదు. మరి తన భర్త, అటువంటివాడుకాదు. అందుకామె విచారించడంలేదు. తాను బాధ పడుతున్నందుకు అతన్ని బాధపడమని ఆమె కోరుకోవడంలేదు. జ్వరంలో వున్నప్పుడు వంటరిగా వదలిపెట్టి వెళ్ళినందుకు, ఆమె కొంచమైనా విచారించడంలేదు. ఆ రోజు వంటచేసి పెట్టలేక పోయినందుకు,హోటలు భోజనం తింటే తనభర్త ఆరోగ్యం చెడిపోతుందని విచారించింది. తనకు జ్వరం వచ్చిందని, అతడు బాధపడతాడేమో అని వాపోయింది. తనభర్త సుఖం కోసం, వెంటనే జ్వరం తగ్గిపోవాలని మనస్సులో అనుకుంది.

"సుఖంలేదు. జీవితానికి ఇహ సుఖంలేదు." తనని చూచినప్పుడల్లా, భర్త అంటున్న మాటలు మదిలో మెదిలాయి.

"అవును. వారికి నావల్ల సుఖంలేదు. అటువంటప్పుడు నేనెందుకు బ్రతకాలి? నేనుంటే వారికి బాధ మిగులుతున్నప్పుడు, బ్రతికి ప్రయోజనం

ఏముంది? నన్ను అసహ్యించుకొని, తప్పుకుంటూ తిరుగుతున్నప్పుడు, నేనెందుకు ప్రపంచానికి దూరంగా వెళ్ళిపోకూడదు? మరణం త్వరగా సంభవిస్తే, పూర్తిగా వారికి నేను కన్పించకుండా వెళ్ళిపోతే, ఈ ప్రపంచానికి దూరంగా తరలిపోతే, అప్పుడు వారు సుఖపడతారేమో! వారి కప్పుడు సంపూర్ణ మనశ్శాంతి లభ్యమవుతుందేమో! దూరమైన తర్వాత వారి మనస్సుమారితే, నేను కావాలని కోరుకుంటారు. వారు తిరిగి మనిషిగా మారుతారు. అంతరాత్మ నుంచి విడిపోయిన అంధకారాన్నిచూచి, వారు భయపడితే, వారికి జ్వరం వస్తుంది. జ్వరంలో, "కమల! నిన్ను అపార్థంచేసుకున్నాను. నన్ను క్షమించు" వారి మాటలు నాకు విన్పిస్తాయి. పైనుంచి, వారికి నేను కన్పించకుండా ఎట్లా పిలువగలను. పిలుస్తే, వారువస్తే యింకేముంది? అంత పని జరగకూడదు. నేను బ్రతకాలి, బ్రతికుండే, వారిని రక్షించుకోవాలి. ఎప్పటికైనా వారు మంచి వారవుతారు. మంచిగా వారి మనస్సు మారుతుంది."

బల్లమీదవున్న మందు సీసా తీసుకొని, గడగడ మందు త్రాగింది. హృదయాన్ని తేలికపర్చుకొంది. ఆలోచనల్ని తొలగించింది. సాయంత్రం అయ్యే సరికి, జ్వరం కొంచెం తగ్గుమొహం పట్టింది. వెంకట్రావు భోజనాలయంలో మస్తుగా భోజనంచేసి యింటికి వచ్చాడు. కమల మంచంమీద కూర్చుని వుంది.

"భోజనంచేశారా!" మెల్లగా అంది.

"నా గొడవ నీకెందుకు? ముందు నీ జ్వరం గురించి జాగ్రత్తపడు."

"నా జ్వరం తగ్గిపోయింది. మీరేమి ఆందోళన పడకండి. మీరీ రెండు రోజులు హోటల్ భోజనం తింటే, అజీర్తి చేస్తుంది. అమ్మకు ఉత్తరంవ్రాస్తే వస్తుంది."

"నా ఆరోగ్యం గురించి నీకేమి ఆందోళనపడ నవసరంలేదు. వేళకు తిండిపెట్టలేని ఇల్లుకంటె, ఆ హోటలే నయం."

"నిన్న ఒక్క రోజు ఆలశ్యమైంది. ఇంతకు ముందు ఎప్పుడైనా ఆలశ్యమైందా చెప్పండి?"

"ఒక్కసారి తప్పుచేస్తేచాలదూ! వెయ్యిసార్లు చెయ్యాలా?"

"మీరు కొంచెం ఆలోచించి చెప్పండి. ఇందులో నా తప్పేముంది! కట్టెలు లేకపోవుటవల్ల ఆలశ్యమైంది."

"నిన్నెవరు సమర్థించమని చెప్పలేదు. నోరు మూసుకొని నిద్రపో! నోటికివచ్చింది వాగితే, జ్వరం మరీ తీవ్రమవుతుంది." అతను మడతమంచం వాల్చుకొని, నడుంవాల్చాడు.

"ఏమండి! నేనంటే మీకెందుకండి అంతకోపం! మీ కళ్ళకు దెయ్యంలాగ భూతంలాగ కన్పిస్తున్నానా;" పొడిగా నవ్వి, వొత్తగిలింది. అతను సమాధానం చెప్పలేదు.

తెల్లవారేసరికి కమల జ్వరంపూర్తిగాతగ్గిపోయింది. ప్రొద్దున్నేలేచి మొహం కడుక్కొని పొయ్యిరాజేసింది. వెంకట్రరావు దంతప్రక్షాళనం పూర్తిచేసుకొనివచ్చేసరికి, కమ్మనికాఫీ తయారుచేసి యిచ్చింది. అట్లాగే బలం తెచ్చుకుంటూ, పదిగంటలు దాటకముందే వంట పూర్తిచేసింది. అతను మాట్లాడకుండా భోజనం పూర్తిచేసి, ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం పెందరాళే వంటపని ముగించింది. ఆలశ్యమైతే దుమదుమలాడతాడని తెలుసుండి ఆరుగంటలు కాకుండా అన్నీసిద్ధంచేసి పెట్టింది. వేడి నీళ్లుపెట్టుకొని, శుభ్రంగా స్నానంచేసి అందమైన చీర ధరించి, అతనువచ్చేసరికి అందాలరాశిగా కన్పించాలని ఆశపడింది. పెట్టంతావెతికినా, మంచి చీర ఒకటి కన్పించలేదు. పెళ్లయిన తర్వాత అతడామెకు ఒకచీరకూడ కొనలేదు. ప్రస్తుతం రెండుచీరలున్నాయి. ఒకచీర కట్టుకుంటే, రెండవ చీర ఉతుక్కొని వుంచవలసి వుంటుంది. రెండూ ముతక చీరలు, ఆ రెండు చీరలతో అతికష్టంమీద

కాలక్షేపణ చేస్తూవస్తోంది. ఆమెకు బొత్తిగాబట్టలు లేవన్ని సంగతి అతనికి తెలుసు. ఇంట్లో ఏమైనా ఖరీదైనా బట్టలుంటే తీసుకొని వెళ్ళిపోతాడు. "వాటిని ఎవరికిస్తున్నారు" అని అడిగితే, వళ్లు హూనం అయ్యేటట్లు కొడతాడు. ప్రధానానికి పెట్టిన ఖరీదైన చీరలు ఎప్పుడో తీసుకొని వెళ్ళిపోయాడు. ఆమె ఏమి అనదు. తనచొక్కాకు కాస్తచినుగుపట్టితే, వెంటనే కొత్తబట్టలు కుట్టించుకుంటాడు. ఆమెకు బట్టలులేకపోయినా చీరలకు చాల యిబ్బంది పడుతున్నా అతనికి జ్ఞాపకం చేయదు. చేస్తే "జీతమంతానీ చీరలకు పొయ్యాలా?" అంటాడు. అందుచేత మెదలకుండా వూరుకుంటుంది.

స్నానంచేసి, వుతికిని నీలంరంగుముతక చీర కట్టుకొంది. తలదువ్వుకొని, నందివర్ధన పువ్వులు సిగలోతురుముకొని, భర్తకోసం ఎదురుచూస్తోంది. అనుకున్న టైముకంటే, వెంకట్రావు ఆరుకాకుండానే వచ్చేశాడు. భోజనానికి వచ్చి కూర్చున్నాడు ఆమె వంట్లో ఎట్లావుంది! మధ్యాహ్నంభోజనం తిన్నదని గాని, ఏమి అడగలేదు. విఘ్నేశ్వరుడిలాగ కంచం ముందు కూర్చుని, దిమాకులు చేయడం మొదలు పెట్టాడు. ఆమె వడ్డన పూర్తిచేసి, పక్కగా వొదిగి నిలబడింది.

"ఇది కూరా? కషాయమా? ఇంత ఉప్పు వేసి కూరను విషంచేయకపోతే, కాస్త తగ్గించి చావకూడదూ?" కూరగిన్నె అవతలకు విసరగొట్టి, రసం కలుపుకొని నాల్గుమెతుకులుతిని కంచం దగ్గరనుంచి లేచి వెళ్ళిపోయాడు. ఆ రోజు అతడు ఎంతో సంతోషిస్తాడని ఆశించింది. విసిరివేసిన గిన్నెనుతీస్తూ, వెళ్ళిపోతున్న అతనివంక చూచింది. అతడు మళ్ళా వెనక్కి తిరిగిచూడలేదు. కూర రుచి చూచింది. ఎక్కువుగా ఉప్పు కసంగాలేదు. కొంచెం ఎక్కువయింది. అదైనా అన్నంలో కలుపుకుంటే సరిపోతుంది. కాస్త దానికి యింత రాద్ధాంతంచేసి వెళ్ళాడు. చిన్న పొరపాటు జరిగితేచాలు, సర్ధుకొని వూరుకోడు. మీద విరుచుకొనిపడటం బాగా నేర్చుకున్నాడు. ఏదో వంకపెట్టి, తప్పులను కల్పించి, ఆమెను నిందించకుండా వుండనిరోజులేదు. అతడెంత నిందించినా, హింసించినా, ఆమె పల్లెత్తుమాట అనదు.

ఆ మరునాడు కూతురిని చూద్దామని, పాలకొల్లు నుంచి కమల తల్లి సుందరమ్మ బెజవాడ వచ్చింది. కూతురు ఇంట్లో దిగింది. రావడంతో కమలనుచూచి నిర్ఘాంతపోయింది. పెళ్ళికాకముందు తెల్లగా బొద్దుగా వుండేది. ఇప్పుడు శరీరం నల్లబడిపోయింది. వళ్ళు కూడ చాల వరకు తీసిపోయింది. సుందరమ్మ కూతుర్ని కావులించుకొని కన్నీరు పెట్టింది.

"ఎముకలు లెక్కపెట్టవచ్చు. ఇంత శల్యమైపోయావు. తెల్లటి శరీరం ఎంత నల్లబడిపోయిందో చూడు. సరిగా చూడటంలేదా!" కన్నీరు తుడుచుకుంటూ కూతుర్ని అడిగింది.

"వారు నాకేటువంటి యిబ్బంది పెట్టడంలేదు. బాగా చూస్తున్నారు. ఈ మధ్య జ్వరంపడి లేవడంవల్ల, నీరసంగావుంది. అంతే!" తేలిగ్గా అంది.

"ఇంత నీరసంతో వంటచేస్తే, ఎందుకు పనికిరాకుండాపోతావు. పాలకొల్లు తీసుకొని వెళ్తాను. నాల్గురోజులువుండి వద్దువుగాని."

"పర్వాలేదు. ఇచ్చట బాగానే వుంటుంది. వంట చేసుకోగలను."

"రెండు రోజులు ఈ వాలకంతో వంటచేసేవంటే మళ్ళా మంచంపట్టడానికా! నా మాటవిను. అల్లుడిగారితో చెప్తాలే!"

"వద్దమ్మ! వారికి హోటలు భోజనం బొత్తిగా సరిపడదు. వేళకు తిండివుండదు. ఆరోగ్యం పాడవుతుంది."

"అయితే, వార్ని కూడ పదిహేను రోజులు సెలవు పెట్టి రమ్మను."

(సశేషము)

# అదృష్ట జాతకుడు

"ప్రమద"



"నాన్నా గూడుపడిపోయిందే ?" అన్న బాబుమాటవిని ఈ లోకంలో పడ్డాను. సముద్రతీరంలో. నాలుగేండ్ల బాబు నా కాళ్లదగ్గిర పిచ్చికగూళ్లుకడు తున్నాడు. బాగ చీకటిపడలేదు. సన్న సన్నగ వాన తుప్పర పడుతున్నది. ఈ సమయంలో బాబుని ఇట్లా తిప్పితే ఊరు కునేదా సావిత్రి ? తన కళ్ళతో, మాట లతో, నవ్వించి కవ్వించే సావిత్రి ఈ నాడు నా ముందునుండే దాటిపోయింది.

సావిత్రిపోయిన 13-వ రోజు. ఆ రోజు సాయంత్రం బాబుని తీసికుని సముద్రతీరాని కెళ్ళాను. నాలుగేండ్లబాబు తనకు తెలిసీ తెలియని ప్రశ్నలతో విసిగిస్తున్నాడు. నాకు అప్రయత్నంగ కళ్ళల్లో నీరు తిరిగి నయి.

"నాన్నా ! ఎందుకేడుస్తున్నావు ?" బాబు ప్రశ్న.

"ఏడవటంలేదు బాబు" అన్నాను.

"నాన్నా అమ్మ ఎక్కడుంది ?"

నాకేం చెప్పటానికి తోచలేదు. పైకి చూశాను. చంద్రుడు ఉదయించాడు.

"అదిగో, చందమామ దగ్గిరుంది."

"నేను వెడతాను నాన్నా చందమామ దగ్గిరికి."

"ఛ ! మనని రానీరు."

"అమ్మ ఎట్లా వెళ్ళిందే ?"

"అమ్మ, అదృష్టవంతురాలు." దుఃఖము అపుకోలేక రుమాలు అడ్డంపెట్టు కున్నాను.

"ఇంటికిపోదామురా."

ఇద్దరములేచి ఇంటికి వెళ్ళిపోయాము. బాబుని సంధ్యచేతికిచ్చి వాకిట్లో అరుగు మీద కూర్చున్నాను.

## 2

"అన్నానికి రా బావా ?" అంది సంధ్య

వెనక్కి తిరిగిచూశాను. సంధ్యగడప మీద నిలుచుంది.

"రాలేనమ్మా ఆకలిపోయింది."

"ఆకలి ఎందుకులేదు బావా ? దిగులు పడి చేసేదేమిటి ?"

"ఏమీచెయ్యలేము. సరేగాని, అన్నము తిని నిద్రపోయాడా బాబు" అన్నాను.

"ఉ. అన్నయ్యా, నాన్న నీకోసరము కనిపెట్టుకు కూర్చున్నారు."

గంట ఎనిమిదయింది. ఇక తప్పదని భోజనానికి లేచాను.

పడుకున్నానేగాని నిద్రపట్టడంలేదు. ఆలోచనలు పరంపరలుగ వస్తున్నాయి. నేను సావిత్రి క్లాసుమెట్సు. నేను మెడికల్ కాలేజిలో ఫైనలియర్ చదువుతున్నప్పుడు ఆమె ఫస్టియరు. మా ప్రేమ ఎట్లా ఏర్పడిందో తెలీదు.

నేను, సావిత్రి పెళ్లిచేసుకోవటము మా ఇంట్లోవాళ్లెవరు ఒప్పుకోలేదు. కాని నా పట్టుదలవలన ఒప్పుకోక తప్పలేదు.

సావిత్రిలో ఎవరు వేలుపెట్టి చెడ్డ గుణము చూపలేదు. ఆ ఊళ్ళో అందరితో తలలో నాలికగ ఉండేది. నాకో సంఘటన అకస్మాత్తుగా గుర్తుకొచ్చింది.

మా చెల్లెలు కూతురు పుట్టినరోజునాడు సావిత్రి తనే అంతపని చేసింది. "నాకొడుకుకు మీ కూతుర్నియ్యవమ్మా" అని మా చెల్లెల్ని సావిత్రి అందిట. "మాకేం ఖర్మక్కా నా" అందిట మా చెలెలు. దాంతో సావిత్రికి కోపమొచ్చి మా ఇంటిగడప తొక్కలేదు. సావిత్రి పోయినరోజున మాఅమ్మ మాత్రంవచ్చి వెళ్లిపోయింది. కాని మా మామయ్య మాత్రం నాకు అండగా ఉన్నాడు.

3

ఆ రాత్రి వాకిట్లో నేను మా మామయ్య మాట్లాడుకుంటున్నాము.

"సంధ్యపెళ్లి తేలలేదురా?" అన్నాడు మామయ్య.

"అవుతుందిలే" అన్నాను.

"పోనీ నువ్వు చేసికోరాదూ."

"నేనా ... మామయ్యా ... ?"

"అవునురా. నిన్నే సంధ్యచేసికుంటానంటున్నది. పైగా బాబుని జాగ్రత్తగ చూస్తానంది. మాట్లాడక ఒప్పుకో."

"ఆలోచించనీ" అన్నాను.

ఎంత ఆలోచించినా చేసుకోటమే ఉత్తమంగా కనపడ్డది. సంధ్యకి నాకు వారంఉంది పెళ్లి.

మా ఇంటికివచ్చిన చుట్టాలు ఒకరోజైన సావిత్రి ఉండగావస్తే ఎంత బాగుండేది.

ఆమెతో ఆ రాత్రే చెప్పాను. "నీవు బాబుని సరిగా చూస్తావా? నీవు, సిగ్గుపడి లాభంలేదు. ఇది భవిష్యత్తుకు సంబంధించింది. చూస్తానంటెసరే లేకుంటే మానేస్తాను" అన్నాను.

"చూస్తాను", అంది ఆమె.

నాకు సంతోషమయిందికాని బాబుని గూర్చి ఒక్కప్పుడు భయం మాత్రం పోలేదు.

మా జీవితము ఒడుదుడుకులు లేకుండా సాగిపోతూంది. కొన్నాళ్లు గడిచినయి. సంధ్య మాతృదేవి కాబోతున్నదని తెలిసిందినాకు. బాబు విషయమై కొంచెము భయపడ్డాను. కాని సంధ్య అటువంటిది కాదని బాబును జాగ్రత్తగచూస్తుందని సమాధానపడ్డాను.

మరోకొత్త కాలెండర్లు వచ్చినయి. బాబుకు నాలుగేళ్లు జరుగుతున్నయి. చాల మంది బడికి పంపమని ఇచ్చిన సలహాను నిర్లక్ష్యపెట్టలేదు. ఈలోగ సంధ్యమాతృదేవి అయింది. నా మనస్సులో ఇంకా దిగులుగానేఉంది, బాబు భవిష్యత్తు గురించి. ఒంటరిగ సావిత్రి దగ్గరకొచ్చి కళ్ళ నీళ్ళు కార్చేవాణ్ణి. కాని ఫోటోలో ఉన్నసావిత్రి నామాట వినిపించుకునేది కాదు. అసలు ఈ పెళ్లి ఎందుకు చేసికున్నాను?

రాధబాబు సంధ్యకు అన్నయ్య అవుతాడు. అతను ఒరోజు మా ఇంటికొచ్చినపుడు బాబు విషయముచెప్పేను. ఇందుకు కారణము లేకపోలేదు. రాధబాబు నేను, ఒకప్పుడు ఒకకంచంలోతిని ఒకమంచంలో పడుకున్నాము. రాధబాబు నేను చాల దగ్గరసన్నిహితులము అందుకే చెప్పేను.

రాధబాబు చివరి సారిగ ఆలోచించి సలహా ఇచ్చాడు.

"పోని అనాధశరణాలయంలోచేర్పిస్తే"

ఈ మాట అనీ అనకముందే రాధబాబు చెంపమీద నాకుడిచెయ్యి తీవ్రముగ పనిచేసింది. రాధబాబు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు. రాధబాబు అన్నట్టు వాడుదిక్కులేనివాడా?

బాబుకి ఇప్పుడు ఎనిమిదేళ్లు. సంధ్య కొడుకు శ్రీధర్‌కి నాలుగేళ్లు జరుగుతున్నాయి. ఓరోజు హాస్పటల్ నుంచి వచ్చాను. ఇంట్లో ఏవోమాటలు వినపడుతున్నయి. వాకిట్లో ఆగేను. "వెధవ! నీకు బడికి జీతముకూడకావాలి! పైగా పుస్తకాలుకూడ! ఎవరిస్తారు నీకు?" అంటున్నది సంధ్య.

"పిన్నీ ఇవ్వాళ కట్టక పోతే బళ్ళోంచి వెళ్ళకొడతారు పిన్ని" అన్న బాబు స్వరంలో దుఃఖము పూర్తిగ ఉంది.

"ఇప్పుడు ఇక్కడనుంచి కదలకపోతే నేను వెళ్ళగొడుతాను." అంది సంధ్య.

"వెళ్ళగొట్టు చూస్తాను" అంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాను. సంధ్యనన్ను చూసి నిశ్చేష్టితురాలయింది.

"ఏం - అలా అయిపోతావు? మర్యాదగఉంటే ఉండు-పోతే పో! వాడినేమన్నా అంటే నేఊరుకోను" అన్నాను కోపంగా! సంధ్యమాట్లాడలేదు. విసురుగ కొడుకును తీసుకుని వెళ్ళిపోయింది.

"నాన్నా! నాన్నా!" అంటూ బాబు వచ్చాడు.

"ఏం బాబు" అన్నాను.

"పొద్దున్న పిన్ని ఇడ్లీ తెప్పించింది నాన్నా! నాకు పెట్టలేదు" వెంటనే ఇంట్లోకి వెళ్లాను. వంటఇంట్లో సంధ్య ఫలహారము చేస్తున్నది. "వాడికెందుకు ఇడ్లీ పెట్టలేదు?" అన్నాను. సంధ్య బాబువైపు కొరకొర చూసింది.

"తెప్పించుకుంటే గదూ పెట్టడానికి!"

"బాబు అబద్ధమాడుతాడా!"

"నిజమే! ఎట్లయినా మీకు మా వాళ్లు మీ ..."

సంధ్య చెంపలు తడుముకుంది.

"సరిగ ఉంటే ఉండు - పోతేపో!" కోపంగా గట్టిగ అరిచాను.

ఆరాత్రి మాకు అన్నము లేదు. బాబుకి ఏవో హోటలునుంచి తెచ్చి పెట్టాను. నేను బాబుపక్క నేపడుకున్నాను. రాత్రినిద్రలో వాడేదో అస్పష్టంగ కలవరిస్తున్నాడు.

బాబు ఇప్పుడు నాలుగవ తరగతి పేసయినాడు. వాడు 5-వ తరగతిలోకి ప్రవేశించాడు. శ్రీధర్‌నుకూడ మొదటి క్లాసులో చేర్పించాను. మొన్న రామయ్య మాస్టారు కనిపించి "మీ బాబు, ఫస్టులో పేసవుతాడండి" అన్నప్పుడు నాకానందము అవధిదాటింది. రోజూ ఏదో ఒక రిపోర్టు బాబునుంచి వస్తునే ఉంది. ఫలితంగ సంధ్యని నాలుగు అఱుపులు అరవటం సంధ్య కళ్లనీళ్లు పెట్టుకోవటం మామూలై పోయింది.

హాస్పిటల్‌నుంచి వచ్చేసరికి బాబు కళ్లు ఎఱ్ఱగ వాచిఉన్నాయి. మొగమంత కంది పోయింది. రెండు చేతులు చెంపలను ఆనించుకుని సావిత్రి ఫోటోముందు కూర్చుని ఉన్నాడు. నిశ్శబ్దంగ లోపలికి ప్రవేశించాను.

"అమ్మా! పిన్ని కొట్టింది."

సమాధానంరాలేదు.

"నేనేం చెయ్యలే అమ్మా! ఉరికినే, ఉప్మాపెట్టమన్నా."

మళ్లీ సమాధానంలేదు.

"ఏం అమ్మా, ఉప్మాతినకూడదా నేను" జాలిగ ప్రశ్నిస్తున్నాడు తన తల్లిని.

"తినచ్చు బాబు! తినచ్చు" అంటూ ఆత్రంగ బాబుని కావలించుకున్నాను.

"నీ బ్రతుకిలా అవుతుందని అనుకోలేదు బాబు" అన్నాను.

"ఎప్పుడూ వాడితో నేనా లోకం! ఉప్మాతిందురు రండి" సంధ్య గదిలోకి వచ్చింది.

"ఛీ! నోర్మూయ్, నీకు బుద్ధిలేదు! నీలో జాలిలేదు, ప్రేమలేదు. స్వార్థం! స్వార్థంతప్ప మరొకటిలేదు. ఫో! తక్షణం నా ఇంట్లోంచి ఫో! ఇక ఈ ఇంట్లో నీకు స్థానములేదు. నీవు నీ కొడుకు ఊరేగండి!" కోపంగా అరిచాను.

సంధ్య "సరే పోతున్నాను. మీరు తండ్రి, ఆయన కొడుకు. ఇంకేం" అంది.

సంధ్య వెళ్లిపోయింది. సంధ్యతో పాటు శ్రీధర్ కూడ వెళ్లిపోయాడు. నేను రిక్తై రైపోయినాను. ఏటా నెలకు వంద రూపాయలు పింఛను వస్తుంది. దాంతో నేను బాబు సరిపెట్టుకోగలము. బాబు ఇప్పుడు రెండవఫారము చదువుతున్నాడు. సంధ్యవెళ్లి ఇప్పటికి రెండేళ్లు. ఇంతవరకు సంధ్య సంగతి తెలియలేదు. ఓ రోజు అన్నంవండి కూర్చున్నాను. ఇంకా బాబు బడినుంచిరాలేదు. సంధ్య దగ్గరనుంచి ఉత్తరము వచ్చింది.

"శ్రీ వారికి;

ఇదే నేవ్రాస్తున్న మొదటి చివరి ఉత్తరము. శ్రీధరుడు పూర్తిగ చెడిపోయినాడు. ఇందుకు కారణము "నేనే"నని అంతరాత్మ బోధిస్తున్నది. నేను మద్రాసులో ఉంటున్నాను. స్కూలు ఫైనలు జ్ఞానంతో ఓ చిన్న స్కూలు పెట్టుకున్నాను. కాని అందులోకి పిల్లలు రాను రాను రావటంలేదు. తర్వాత మరో మిడిల్ స్కూల్లో చేరాను. నా జీవితము అంతా పూర్తిగ పాడయింది. శ్రీధరుడికి పూర్తిగ చెడ్డఅలవాట్లు పట్టుబడ్డయి. చి॥ బాబుని మీరయినా శ్రద్ధగ చూస్తారని ఆశిస్తాను.

మీ "సంధ్య"

నా కళ్లల్లోంచి రెండు కన్నీటి బిందువులు రాలినయి. "నాన్నా నాన్నా!" అన్న బాబు మాటవిని ఈ లోకంలో కొచ్చాను.

బాబు మధ్యాహ్నం బడికి వెళ్లాడు. రేపటినుండి వాడికి శలవలు. రేపె మద్రాసు వెళ్దామనుకున్నాను. పెట్టె, బెడ్డింగు ఆపూటే సర్దేశాను. బాబు రాగానే మద్రాసు వెళ్తున్నామని చెప్పాను. వాడు సంతోషంతో "మద్రాసు, మద్రాస"ని గంతులు వేస్తున్నాడు.

మద్రాసు నగరంలో ఇంకా తూర్పు తెల్లవారలేదు. ఇంజనుమోత నగరమంత వ్యాపిస్తున్నది. కాఫీత్రాగి టాక్సీలో ఓ హోటలు కెళ్ళాము. రూము తీసికుని, పెట్టె, బెడ్డింగు గదిలోపెట్టి నేను బాబు

మిడిల్‌స్కూలువైపు నడక సాగించాము. మిడిల్‌స్కూలు అష్టకష్టాలుపడి చేరుకున్నాము. కాని స్కూలుకు శెలవలు అనగానే నాకు నిరాశ అయింది. అక్కడున్న ప్యూనుని పిలిచి "ఇక్కడ సంధ్యాదేవి అనే ఆవిడ టీచరుగ పనిచేస్తుంది తెలుసా" అన్నాను.

"తెలీకేం బాబు తెలుసు, ఆవిడని ఎరుగనివాళ్లున్నారా?" అన్నాడు.

"ఏం? ఆవిడంత గొప్ప మనిషా."

"కాదు బాబు, మీకు తెలుస్తుందిగ. ఎందుకు చెడిపోతారు బాబు మీరుకూడ. చూస్తూ చూస్తూమిమ్మల్ని వేశ్య ఇంటికి ఎలా తీసికుపోను;"

సంధ్యవేశ్యా! నామతిపోయింది.

"అదే బాబు, వస్తాబాబు చెడిపోకండి" అన్నాడు. ప్యూను వెళ్లిపోయాడు.

చిన్నఇల్లు. వాకిట్లో ఏవో మొక్కలు పెంకుటిల్లు అది. బయటనున్న కిటికీలోంచి చూచాను.

"సంధ్య!" పిలిచాను.

తలుపుతీసింది.

"ఎందుకొచ్చారు? ఇక్కడున్నట్లు ఎలా తెలుసూ?" అంది.

"తెలుసులే, రాపోదాం!" అన్నాను.

"రాను — రాలేను!" సంధ్య పెదవులుతడబడ్డాయి.

"మనింటికి పోదాంరా సంధ్యా?" అన్నాను.

"మనిల్లు మన - అనేమాటకు అర్థం లేదు. ఇక్కడనేను పడుపువృత్తితోనే జీవిస్తున్నాను. నాకాధారంలేదు. పదేళ్ల శ్రీధరుడుకూడ బీడీలు, సిగరెట్లు, తాగుతున్నాడు. వాడుపూర్తిగచెడ్డాడు. బాగుపడతాడని ఆశ 'ఏనాడో అంతరించిపోయింది. మీరైనా బాబుని శ్రద్ధగ చూడండి." సంధ్య ఆవేశంగ ఆగింది.

"రా బాబు" అందిసంధ్య.

బాబు నా వైపు ప్రశ్నార్థకంగచూశాడు.

"పో బాబు, పిన్ని దగ్గరకెళ్లు!"

"నన్నుక్షమించు బాబు! నేనునీకెంతో అపకారము చేశాను. ఈ నాటికి తెలిసివచ్చింది. మీనాన్నకి తగినకొడుకనిపించుకో! ఏనాటికైనా నువ్వే మీనాన్నను పోషించేది. నా తప్పులన్నీ క్షమించు! నన్ను హృదయపూర్వకంగా క్షమించు. ఎప్పుడయినా నేను గుర్తుకొస్తే నీ గుండెల్లోంచి రెండుకన్నీటిబొట్లు విడువు బాబు"

"ఊరుకో సంధ్య" ఓదార్పుగ అన్నాడు.

"నా అనేవారు దూరమయినారు.

మీారైన చివరిసారిగ వచ్చారు.'' సంధ్య దుఃఖంగ మాట్లాడుతోంది.

''అయితే రా – ?''

''రాను''

బాబు, నేను బయలుదేరాము. ''ఉండు బాబు'' అంటూనే సంధ్య వంట ఇంటి లోపలినుండి ఓ అయిదు రూపాయిలనోటు తెచ్చి, ''బాబు, మీా అమ్మను క్షమిస్తావు గదూ?'' అందిజాలిగ. బాబుకర్థముకా లేదు. నా వైపు వింతగ చూశాడు.

మావూరు తిరిగి వచ్చేశాము. బాబు బి. ఎ. పేసయ్యాడు. మా ఊళ్ళోనే ఇనస్పెక్టర్ గ జాయిన్ అయ్యాడు. ఆరోజు గబగబ పరుగెత్తుకునివచ్చి,

''నాన్నా, చూశావా? ఎన్నో హత్యలు దోపిడిలు చేసిన శ్రీధర్ అనేగజదొంగని పట్టుకున్నాను. ఇంక ప్రమోషన్ వస్తుంది'' అన్నాడు సంతోషంగ.

''పద – నేను అతడ్ని చూడాలి.'' అన్నాను. ఇద్దరము స్టేషనుకెళ్ళాము.

మాసిన, చినిగిన చొక్కా, బాగ చినిగి అతుకులేసిన పొడుగులాగు సంకెళ్లు చేతులకి, నలుగురు పోలీసులు కాపలా ఉన్నారు.

''నీ పేరూ''

''శ్రీధర్'' అన్నాడు.

''మీా అయ్యపేరు''

''తెలవదు బాబు''

''మీా తల్లి ఉందా!''

''ఆ - సంధ్య.''

శ్రీధర్ కి ఉరిశిక్ష పడింది. నేనేం చెయ్యను! పుట్టగానే ''అదృష్టజాతకుడి విరా'' అన్న మాతాతయ్య మాటలు నాకిప్పటికి జ్ఞప్తికివస్తుంటయి.

# బిడ్డలు - తల్లిదండ్రులు

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య



(గత సంచిక తరువాయి)

### ఆత్మ నిగ్రహమేర్పడుటకు మూలాధారములు:

### (Foundations of self - control)

నిగ్రహమనునది బిడ్డలకవసరమేగాని అది వీలైనంతవరకును ఆత్మనిగ్రహము కావలెను. బిడ్డలకది యలవడుటెట్లు?

1 బిడ్డ పుట్టినది మొదలు అతనికి మంచియలవాట్లేర్పడుటకు తగిన శిక్షణ నీయవలెను. పశితనమున నిద్రాహార, క్రీడావిసర్జన కార్యములందు తనకేర్పాటైన క్రమవిధానమునను సరించుటచే బిడ్డ ఆత్మనిగ్రహమును జూపనారంభించును. ఏడ్చినపుడెల్ల ఎత్తుకొనుటయు, ఆహారము నొసగుటయు జరుగుచుండెనేని ఆత్మనిగ్రహమెట్లలవడును? పట్టుదలయు, అవిధేయతచూపుటయు మాత్రమే పట్టువడును. చాలమంది తల్లులు తమ బిడ్డలను, పసితనముననొక క్రమ విధానముననే పెంచుదురు. కాని పసితనము దాటగనే క్రమవిధానమునను సరింపక నశ్రద్ధ చేయుదురు. అందుచే బిడ్డలకు క్రమపద్ధతిచే మొదటకలిగిన కొంచెము మేలును నశించును. పూర్వము, పద్ధతిగానుండి, కులాసాగానున్న పిల్లలు ఇప్పుడాపద్ధతిలేక ఒడుదుడుకై తల్లులను కష్టపెట్టసాగుదురు. కొందరు బిడ్డలు ఎక్కువ చురుకుగానుందురు. ఎక్కువ సున్నిత స్వభావులును వ్యక్తిత్వము జూపువారును ఐయుందురు. వారిని నిర్వహించుట కష్టమేయైనను వేరు పద్ధతులననుసరింపజాలము. ఎదిగినపిదప ఆత్మనిగ్రహమలవడుటకు ఏయలవాట్లు ఏర్పడుట ఇతరపిల్లలకు ముఖ్యమనుకొందుమో అవియే ఈ పిల్లలకును ముఖ్యమగును.

2 ఆరంభమునుండియు — ముఖ్యముగా ప్రాకుటకారంభించినది మొదలు — బిడ్డకు సాధ్యమైనంత స్వేచ్ఛనీయవలెను. పరిసరములలోనతనికి ప్రమాదకరములగు నాకర్షణలేవియు లేకుండ జేయుచు అతని నాటంకపరచెడి అగత్యమురాకుండ జూచుకొనవలెను. ఇట్లు జాగ్రత్తపడుటచే బిడ్డచేయు పనులు యుక్తములేయగును. అందుచే మనమతనిని తరచుగ నడ్డుటయు, చిరాకు పరచుటయు జరుగకుండును.

వింతను జూపుట బిడ్డలకు సహజము. వింతను జూపక వారు బుద్ధివికాసము నొందజాలరు. ప్రతి విషయమును స్వయముగ పరిశీలించియు, పరిశోధించియు తెలిసికొన జూతురు. వద్దన్నవాటియెడలనే వారికి వింతయెక్కువగా నుండును. తల్లి తాకరాదన్న వస్తువును బిడ్డతాకగోరును. చేయవద్దన్నది చేయ ప్రయత్నించును. అందుచే అతనికి బాధలు కలుగుచుండును. తల్లియున్నప్పుడు బిడ్డ సరిగానేయున్నను, ఆమె లేనపుడు వలదన్నపనులనే చేయప్రయత్నింపగలడు. ఇది తల్లిగ్రహించి అయుక్తములగు నాకర్షణల తని మార్గమునలేకుండ జేయవలెను. తెలివియెక్కువ గలబిడ్డలకు వింతయునెక్కువగానే యుండును. కనుకనే వారుతరచుగ బాధలకులోనగుచుందురు. (గొప్పవారెందరో చిన్నతనమున మాట వినక దుడుకుపనులనుచేసి కష్టపడినవారే!) విలువగల

వస్తువునొకదానిని బిడ్డకోరినపుడు అతనికంతయాకర్షణీయముగు మరియొకదానిని ప్రత్యామ్నాయముగనీయవలెను. అట్లిచ్చుట వీలుగానిచో ఆ విలువగలవస్తువునే ఇచ్చి పదిలముగావాడుట నేర్పవలెను. అట్లైనచో బిడ్డ బుద్ధిపూర్వకముగ నవిధేయత జూపుటయు, శిక్షనొందుటయు జరుగబోదు. దానివలన తల్లీబిడ్డలనడుమ తగాదాలులేక సరియగు సంబంధానుబంధములేర్పడగలవు.

3 బిడ్డడెదుగుకొలది అతనిస్వవిషయములలో నెక్కువ జోక్యమును కలుగజేసికొనరాదు. అతనిపై యధికారమును జూపుటయు క్రమముగా తగ్గించవలెను. ఏదైన నెంచుకొనవలసిన సందర్భములో అతనికి స్వేచ్ఛనీయవలెను. అట్లనుటచే అతనికసలే సహాయపడరాదని యనుకొనరాదు. మనసహాయమతనికవసరమేయైనను సాధ్యమైనంతవరకు అతని సమస్యలను గూర్చి అతనితోడనే చర్చించుచుండవలెను. అతనినిగూడ ఆలోచనపరునిగను, న్యాయాన్యాయవిచక్షణ నెరిగిన వానిగను భావింపవలెను.

కొన్ని సమయములలో బిడ్డ తనకేదిమంచిదో నిర్ణయించుకొనజాలకుండును. అట్టియెడ తల్లిదండ్రులే ఆ నిర్ణయమును చేయవలసివచ్చును. బిడ్డకన్నను వారెక్కువ యనుభవపరులగుటవలన అతనికేది మేలగునదియు వారికే తరచుగ తెలియును. ఐనను వారు తమకే సమస్తమును తెలియుననెడి యభిప్రాయముననుండరాదు. నిర్ణయభారమును పూర్తిగ బిడ్డకే వదలక తగురీతిని అతనిని నడుపుచు, నిగ్రహించుచు, తమబాధ్యతను నిర్వర్తింపవలెను.

4. తల్లిదండ్రులు తమ బిడ్డను ఆత్మనిగ్రహము జూపుమని చెప్పినచాలదు. తామును ఆత్మనిగ్రహమునుజూపుచు అతని కాదర్శప్రాయులు కావలెను. తామొకరీతిని చరించుచు బిడ్డనింకొకరీతినుండుమనుట భావ్యముగాదు. బిడ్డనడుగకయే తల్లిదండ్రులతని యాటవస్తువులను నిర్లక్ష్యముతో దీసి అవతలపడవేయునెడ వారిసొత్తునతడెట్లు గౌరవముతో జూడగలడు? అతనితో మనమతికటువుగను, మోటుగను మాట్లాడుచు అతనినిమాత్ర మితరులతో మహామర్యాదగా మాట్లాడుమనుటలో నర్థమేమి? తల్లి ఏదడిగినను తండ్రిమండిపడుచుండెనేని బిడ్డకితరుల కష్టములనాలోచించి సానుభూతిని జూపెడిగుణ మెట్లబ్బును. మంచిగుణములివియని బిడ్డకు కార్యరూపముల జూపవలెను. వట్టిమాటలచే నవియలవడునవిగావు. ఇంతకు పర్యవసానమేమన అల్లరికిని, అవిధేయతకును అనువగు నవకాశములను తగ్గించెడి పరిస్థితుల నేర్పరచుటకు ప్రయత్నించుటయే మంచి క్రమశిక్షణ విధానమగును. డాక్టరు స్యూసన్ ఐసాక్ ఉద్దేశములనుగూడ నిటగమనింపనగును. ఆమె చెప్పిన దేమన బిడ్డల క్రమశిక్షణ సంగతినిగూర్చి విచారించునపుడు మూడు విధములగు విషయముల నాలోచింపవలెను. అవియేవనగా ;

(a) బిడ్డ తప్పక విధేయత జూపవలసిన విషయములు.

(b) బిడ్డ స్వయం నిర్ణయమునకై పూర్తి స్వేచ్ఛనీయగల విషయములు.

(c) విధేయతకు జెందినవని సరిగా జెప్పుటకు వలనుపడని విషయములు.

మొదటి తరగతికి జెందిన విషయములు బిడ్డ నిత్యజీవితమున కవసరమైనవి. అవి యేవనగా - వేళకు భుజించుట, స్నానముచేయుట, పరుండుట, భోజనమునకుపూర్వము చేతులను కడుగుకొనుట, ఆటవస్తువులనెత్తి దాచుకొనుట, ఇతరుల సొత్తును వారి నడుగక ముట్టకుండుట, ఇతరులను కొట్టుట, కొరుకుట చేయకుండుట మొదలగునవి. ఇవి యన్నియు బిడ్డ ఆరోగ్యమునకును, భద్రతకును, ఇతరుల హక్కులకును సంబంధించిన విషయములై యుండును. వీని నతడు తప్పక పాటింపవలెను. విధేయతయే ప్రధానమని, దానికై బిడ్డకు తగిన శిక్షణ నొసగజూచునపుడు ఈ విషయములెంతో ఉపకరించును. కారణమేమన ఈ విషయములలో బిడ్డను విధేయత జూపుమనుట కడు

సమంజసమగును. విషయము మంచిచెడ్డల నాలోచింపక విధేయత జూపుమని నిర్బంధించునప్పటికంటెను కారణయుతములగు విషయములలో విధేయతను జూపగోరునపుడే మన మెక్కువ దృఢత్వమును, ఓర్పును జూపగలము.

రెండవ తరగతికి చెందినవానిలో బిడ్డ తానేమి చేయునదియు స్వయముగ నెంచుకొనుటకు వీలగు విషయములెన్నో చేరియుండును. చిన్న పిల్లలు సహితము తమ యాటవస్తువులను బీరువాలోగాని పెట్టెలోగాని ఎట్లు సర్దుకొనునదియు, ఆటసమయముననే యాటలాడునదియు, ఏ స్నేహితులను విందునకు పిలుచుకొనునదియు, తోటలో తమ కేర్పాటైన స్థలమందు ఎట్టి మొక్కలను పెంచునదియు, తమ ఖర్చునకిచ్చిన జేబుసొమ్మును ఎట్లు వెచ్చించునదియు (తినుబండారములకుగాక) ఇత్యాది విషయముల నెన్నిటినో వారే నిర్ణయించుకొనవచ్చును. ఎంచుకొనెడి స్వేచ్ఛను బిడ్డకిచ్చినపుడు అతడేది నిర్ణయించుకొన్నను ఒప్పుకొనవలెను. ఆ నిర్ణయము మన మనుకొన్న విధమున లేదని దానిని మార్చరాదు.

మూడవ తరగతికి చెందిన విషయములు విధేయతను జూపవలసినవిగ పరిగణించుటచే ఫలితముండదు. ఇవి రెండు విధములు. స్నేహభావముతో నితరుల నభినందించుట, శాంతతను, సౌజన్యతను జూపుట. ఇతరుల సంగతిని గమనించుట, బిడియపడక సహజముగా నుండుట, ఇతర పిల్లలతో నాడుట కిచ్చగించుట, మొదలగునవన్నియు మొదటి తరగతికి చెందినవి. ఈ విషయములను బిడ్డకు సూచింపవచ్చును; లేదా బోధింపవచ్చును. కాని శాసింపజాలము. ఒక్కొక్కప్పుడు బిడ్డలు పెద్దల ఆజ్ఞానుసారముగ నేవో పైమర్యాదలను జూపవచ్చును. ఆ మర్యాదలు పెద్దల యహంభావమును సంతృప్తిపరచుట కుపకరింపగలవేమోగాని వాస్తవికములు మాత్రము గావు. తల్లిదండ్రులు తన సంగతిని గమనించుటయు, తన్నర్ధముచేసికొనుటయు బిడ్డ కనుభవమైనకొలది అతడును ఇతరుల సంగతిని గమనింప ప్రయత్నించును. నిజమగు స్నేహభావము, లోనుండి జనింపవలెను. దానిని శాసించుటచే సాధింపజాలము.

గోళ్లు కొరుకుట, వ్రేళ్లను చీకుట, నత్తిగా మాట్లాడుట, నిద్రపోకుండుట మొదలగు ప్రవర్తనలు నాడీ సంబంధమైనవి. ఇవి రెండవ తరగతికి చెందినవి. వీనిలోనే యొకదానిని విధేయత జూపవలసిన విషయముగ భావింపరాదు

పైజెప్పిన విషయములలో డాక్టర్ ఐసాక్ అభిప్రాయములు పూర్తిగ తెలుపబడినవి. బిడ్డను ప్రతి విషయమందును విధేయత జూపుమని బలవంతము చేయరాదు. విధేయతచూపుట యవసరమగునదియు, కానిదియు అతడు చేసెడి కార్యమునుబట్టియు దానికి గల ప్రాముఖ్యతనుబట్టియు నిర్ణయించవలెను.




డాక్టరు వి. యస్. శర్మ

ఉత్తర ఐరోపా దేశంలో పూర్వం ఒక రాజు వుండేవాడు. అతడు ఎంతో మంచివాడు. లేక లేక అతనికొక కూతురు పుట్టింది. ఆ పిల్ల అతిచక్కనిది. అంత అందమైన పిల్లలు ఆ దేశంలో ఇంకెవ్వరూ లేరు. కాని ఎప్పుడుచూసినా విచారంగా కనిపించేది. చూసినవాళ్లంతా ఆశ్చర్యపోయేవాళ్లు. "ఆమె అందమేమి, ఆమె వికార అవస్థయేమి!" అని విచారపడేవాళ్లు. తల్లిదండ్రులు తనకేదానా కోరిక వుందా అని అడిగితే "ఏమీలేదు" అని మాత్రం జవాబిచ్చేది. ఆమె విచారానికి కారణం ఎవరూ తెలుసుకోలేకపోయారు. ముఖాన చిరునవ్వైనా ఎప్పుడూ లేదు! ఆమె అవస్థచూసి రాజు, రాణి చాలా బెంగపెట్టుకున్నారు.

క్రమంగా ఆ పిల్ల పెద్దదయింది. వయస్సుతో బాటు సౌందర్యమూ వృద్ధి పొందింది. పెళ్లియీడుకూడా వచ్చింది. తల్లిదండ్రులు చేసేదేమీలేక బెంగపెట్టుకున్నారు ఒక రోజున రాజుగార్కి ఒక ఆలోచన తట్టింది. తన కూతుర్ని ఎవరైతే నవ్విస్తారో, వారికి ఆ పిల్లనిచ్చి పెండ్లి చేసి, తన రాజ్యాన్నికూడా ఇచ్చేస్తానని సాటింపువేయించాడు. రాజ్యంపోయినా సరే, తన కూతురు సుఖపడితే చాలు అనుకున్నాడు. రాణీకూడా ఒప్పుకుంది.

ఆ పిల్ల అందాన్నిచూసి కొంతమంది, రాజ్యకాంక్షతో కొంతమంది, దేశదేశాల్లోని యువరాజులంతా ఒక్కొక్కరే వచ్చారు. తమ శక్తికొలది ప్రయత్నించి ఆ పిల్లను ఎట్లాగేనా నవ్విద్దామని ప్రయత్నించారు. అనేక తమాషాలు, వింత ప్రదర్శనలుచేశారు. కాని ఒక్కరికీ లొంగలేదు. వెర్రిమొఖాలు వేసుకొని తిరిగివెళ్లిపోయారు. ధైర్యమున్న సామాన్య యువకులుకూడా ప్రయత్నించిచూశారు. లాభంలేకపోయింది.

రాజావారికోటకు సమీపాన్నే, ఒక బీద గృహస్థుడున్నాడు. ఆయనికి ముగ్గురు

కొడుకులు. ఆ ముగ్గురూ, రాజుగారికోటలో జరిగే విడ్డూరమంతా విన్నారు. తాము కూడా ప్రయత్నించి చూద్దామని నిశ్చయించారు. తలిదండ్రుల అనుమతి కోరారు. కాని, "మహారాజెక్కడ, మన మెక్కడ, మనబోటి బీదలకు శక్తికి మించినపని" అని తల్లిదండ్రులు బోధించారు. ఐనా, వారిలో అదృష్టవంతులెవరైనా వున్నారేమో అనే ఆశతో, "ఒక్కొక్కరే పోయిరమ్మ"ని అనుమతిచ్చారు.

పెద్ద కొడుకుది మొదటి ఛాన్సుగా ఏర్పాటుచేసుకున్నారు. మంచి సమయం చూసుకొని పెద్ద కొడుకు కోటలో ప్రవేసించి, రాజుగార్ని దర్శించి, తన కోరిక విన్నవించుకున్నాడు. ఈతడు సామాన్యుడని తెలిసి, నెగ్గలేడనే అనుమానంతో, ఒక క్రొత్త నిర్బంధం ఏర్పరచాడు. ఆ పిల్లను నవ్వించకల్గుతే, తన మాట ప్రకారం రాజ్యమిచ్చేస్తానన్నాడు. ఒకవేళ, నవ్వించలేకపోతే, యావజ్జీవం ఖైదుశిక్ష విధిస్తానని చెప్పాడు. దానికి వప్పుకొని, నిండు సభలో కూర్చున్న, నవ్వురాని రాజకుమార్తె ప్రక్కకు చేరాడు.

యువకుడు:–"ఈ జీవితం నాకు నచ్చలేదు. చక్కగా మిలిటరీలోచేరి, రకరకాల కసరత్తులుచేస్తూ కోతిలాగ, కొంగల్లాగ కుప్పిగంతులువేస్తూ, ఆనందించవచ్చు. నా చాకచక్యంచూసి, మిలిటరీ అధికార్లు మెచ్చి, నాకు బిరుదులు, మెడల్సు ఇస్తారు. బహుమతులుకూడా ఇస్తారు" అని, ఆపిల్లకేసిచూస్తూ, కుప్పిగంతులు, పిచ్చి చేష్టలు చేయనారంభించాడు.

అక్కడి సభికులంతా కడుపుబ్బేలా నవ్వేరు. కాని, ఆ పిల్లమాత్రం చెలించలేదు. పైగా, ఆ పిచ్చివాడ్ని బైటకు పంపివేయమని ఆజ్ఞాపించింది.

వెంటనే రాజుగారు, ఆ యువకుని ఖైదుచేయించాడు.

మరునాడు రెండవకుమార్డు కోటకు వచ్చాడు. తనకోరిక వెల్లడిచేశాడు. రాజావారు, తననిబంధనలను నికచ్చిగా చేప్పేశారు, ఆయువకుడు, ఆనిబంధనలకు వప్పుకున్నాడు. వెంటనే బడి పంతులు వేషం వేసుకొని, సభలో ప్రవేసించాడు. వచ్చీరాని సంగీతంతోకూని దీర్ఘాలు తీస్తూ ఆ పిల్లను సమీపించాడు. తన చేతనున్న బెత్తంతో బడిపంతులు మాదిరిగా చుట్టుప్రక్కలవాళ్లనుమోదటం ప్రారంభించాడు అచ్చంగా పూర్వక్కాలపు బడిపంతులు మాదిరిగా హాస్యరసాన్ని వప్పించాడు. సభాసదులంతా కడుపుబ్బేలా నవ్వారు. కాని ఆ అమ్మాయి మాత్రం గుడిలో బొమ్మలా అట్లాగే కూర్చునివుంది. నవ్వు మొఖంమైనా పెట్టలేదు. రాజుగారు పెది

మలు విరిచి, లాభంలేదని, ఆయువకుడ్ని కూడా బంధిఖానాలో వేయించారు.

ఇంక మూడవ సోదరుని ఛాన్సు వచ్చింది. తన అన్నలిద్దరికీ జరిగిన పరాభవం తెలుసుకున్నాడు. వాళ్ళ పద్ధతులు చప్పగా వున్నాయనుకున్నాడు! తానొక క్రొత్త మార్గం త్రొక్కాలని నిశ్చయించాడు.

మరునాడు, రాజదర్శనంకోసంకోటలో ప్రవేశించాడు. వాడ్నిచూడగానే, రాజా వారు "మా అమ్మాయిని నవ్వించి, పెండ్లాడుదామని వచ్చావా" అని ప్రశ్నించారు.

యువకుడు - కాదు మహారాజా. నేనొక సామాన్యుడ్ని. మీరు మహారాజులు మీ కుమార్తె గొప్పరాజ కుటుంబం లోనిపిల్ల, ఆమె యెక్కడ, నేనెక్కడ! నక్కయెక్కడ, దేవలోక ప్రవేశ మెక్కడ! సాధ్యమైన పని కాదు.

రాజు:-అట్లాగైతే, మరెందుకు వచ్చావు?

యువకుడు:-నేను నౌఖరీ వృత్తిలో ఆరి తేరినవాడిని, అనేక గొప్ప యిండ్లలో పనిచేసివచ్చాను. మీదయ సంపాదించి మీకు సేవచేద్దామని వచ్చాను.

రాజు:-అలాగా! మాకొక నౌకరు వెంటనే కావలసివుంది. వంటయింట్లో సహాయం చెయాలి. కట్టెలు కొట్టాలి. నీళ్లు తోడాలి బట్టలు పిండాలి. ఈలాటి పనులు చేయడానికి నీకు ఇష్టమైతే, ఇప్పుడే పనిలో పెడతాను. ఆలోచించుకో?

యువకుడు:-మీరు చెప్పినపనులన్నీ నాకు క్రొత్తవికావు. ఆపనులన్నీ, చక్కగా చేసి, మీకు తృప్తికలగచెయ్యగలను.

ఇట్లాచెప్పి పనిలోప్రవేశించాడు. నీళ్లు తేవడం, పాత్రలు కడగడం వగైరా పనులన్నీ చక్కగాచేసేవాడు. కొంతకాలం గడిచింది. ఒకరోజున నూతిలోనీళ్లుతోడుతూండగా, ఒక పెద్ద చేపకనపడింది. ఆ చేప ఈదులాడుతూ వింతవింత పనులు చేస్తూంది. దాన్ని నెమ్మదిగా తన బొక్కెనలో దూరనిచ్చి, జాగ్రత్తగా పైకితీశాడు. తన కడవలో భద్రంగా చేర్చి నెత్తిన పెట్టుకొని నడుస్తున్నాడు. దారిలో ఒక ముసలావిడ ఎదురయింది. ఆమెచేతిలో ఒక బంగారు బాతువుంది. అదిపారిపోకుండా అందమైన ఒకత్రాడు దానిమెడలో కట్టబడివుంది. ఆ బాతునిచూసి, ఆ పనివాడు ఆశ్చర్యపోయాడు. అది ఒకవింతయైన బాతుగా గ్రహించాడు.

సేవకుడు:-అవ్వా, అవ్వా! నీ చేతిలోది నిజమైన బాతేనా? ఎంత అందంగా వుంది! ఆ రెక్కలు దానవేనా, లేక బంగారంతోచేసి అతికించారా?

అవ్వ:-దానికేం గాని, నీకడవలో ఏదో మెరుస్తూందే, ఆచేప నీకెక్కడిది ? నా బాతుకంటే వింతైందిలాగుందే!

సేవకుడు:-కాదమ్మా - నీ బాతే చాల గొప్పది. నీ బాతును నాకిస్తే, నా చేపను నీకిస్తా.

అవ్వ:-సరే... ఐతే, ఒక్కవిషయం నీతో చెప్పాలి. దాన్ని ఎవరేనా తరిమితిరా అది వారికి దొరకదు, సరికదా, పైగా వాళ్లు దాన్ని వెంబడిస్తూవెడుతూనే వుంటారు. ఈ రహస్యాన్ని నీ స్నేహితులకు చెప్పకుండాలి-జాగ్రత్త.

అని, తన బాతును ఆ పనివాడికిచ్చి వాని కడవలోనున్న చేపను తీసుకొని వెళ్లిపోయింది.

ఆ బాతును వెంటపెట్టుకొని పనివాడు కోటవైపుకు వస్తున్నాడు. దోవలో నడుస్తూన్న మరొక ముసలమ్మ, ఆ బాతును చూసి నిర్ఘాంతపోయింది. ఆమెకు బాతులంటే ఎంతోయిష్టం. తన అలవాటు ప్రకారం ఆ బాతువెంటే వచ్చి, దాన్ని తరమటం ప్రారంభించింది. దాన్ని పట్టుకొని ముద్దుపెట్టుకుందామనుకొంది కాబోలు. వెంటనే, ఆ పనివాడు ఆమెను వారించి, దానిశక్తిని వర్ణించాడు. కాని ఆమె వింటేగా! దాన్ని ఎల్లాగేనా పట్టి ముద్దు పెట్టుకోవాలని ఆశపడింది. తరమనారంభించింది. ఆ పనివాడివెంట బాతూ, బాతు వెంట, ఆ ముసలమ్మ నడుస్తూనే వున్నారు. ఆ యవ్వకు కాళ్లు నెప్పులు పుడుతున్నాయేకాని ఆ బాతు మాత్రం దొరకడంలేదు. కొంతసేపటికి, ఆ కోటలోనే పనిచేసే, మరొక నౌకరు, ఆ బాతును చూశాడు. వాడికికూడా, దానిమీద కన్నుపడింది. ఎల్లాగేనా దాన్ని కాజెయ్యాలని నిశ్చయించాడు. తానొక పెద్ద నౌఖరు కదాయని దబాయిస్తూ ఆ బాతును సమీపించి, అమాంతంగా దాని కాళ్లు పట్టుకోపోయాడు. కాని అది దొరుకుతేగా! మాయలమారిబాతు. దాన్ని పట్టుకుంటే, అది దొరకదు సరిగదా, దానివెంట పోవలసివస్తుందని ఎంత వారించినా విన్నాడు కాదు. సాహసించాడు. చివరకు విచారపడవలసివచ్చింది. పనివాడి వెంట బాతు, బాతువెంట ముసలమ్మ, ప్రక్కనే నౌఖరు నడిచిపోవలసివచ్చింది. అట్లా నడుస్తూ కోట సమీపానికి వచ్చారు. ఆ సమీపంలో వున్న ఒక కమ్మరివాడు ఆ వింతచూశాడు తనలో ఇట్లా అనుకున్నాడు.-"ఇదిచాల వింతగావుంది. దీన్ని చూస్తే రాజకుమార్తె ఆశ్చర్యపోయి తప్పక నవ్వుతుంది. ఈ పనికి నేనేకారకుడనని అనిపించుకుంటే, రాజకుమార్తె నాకు దక్కుతుంది. దానితో నా దరిద్రం అంతా మాయమైపోతుంది. ఐతే, నేనిప్పుడు ఏమిచెయ్యాలి ? ఆ నౌఖరు కుర్రాడిని దబా

యించి, ఆ బాతును స్వాధీనపర్చుకోవాలి!" అని తన చేతనున్న, పెద్దకత్తెరను, ఆ పనివాడిచేతికీయబోయాడు.

నౌఖరు:-ఓయీ, ఆగు ఆగు! ఆ మనిషి చేతికి, కత్తెరనిస్తివా, బాతు శక్తి, నీ మీద పడుతుంది. నువ్వుకూడా, మా వెంటరావలసివస్తుంది. జాగ్రత్త ఆలోచించుకో.

ఈ సలహాను వాడువింటేగా, దురాశ దుఃఖమునకుచేటు, కత్తెర వాని చేతికిచ్చేడో లేదో, ఆ బాతు శక్తి ప్రవేశించింది. తాను కూడా, ఆ బాతు వెంట రావలసివచ్చింది.

పనివాని వెంట బాతు, బాతువెంట అవ్వ, అవ్వతో నౌఖరు, నౌఖరుతో కమ్మరివాడు నడుస్తున్నారు. ఈ గొలుసును వెంటబెట్టుకొని, పనివాడు కోటలో ప్రవేశించాడు. తిన్నగా, రాజకుమార్తె కూర్చున్న హాలులో ప్రవేశించాడు. ఆ పిల్లకన్ను ఆ వింత దృశ్యంమీదపడింది. వెంటనే నవ్వ నారంభించింది. ఆ పనివాడు కూడా నవ్వేడు.

పనివాడు:-ఓ పిల్లా!- ఇంతేనా నీశక్తి, ఇంతకంటే ఎక్కువగా నవ్వలేవా? ఏదీ ఈ సారిచూద్దాం! అంటూ ఆమె చుట్టూ, చప్పట్లుకొడుతూపరుగెత్తాడు. వాడివెంట బాతు బాతువెంట అవ్వ, అవ్వప్రక్కన నౌఖరు, నౌఖరు ప్రక్కన కమ్మరి పరుగిడనారంభించారు. వాళ్లు పడే శ్రమ, బాధచూస్తూ, మరీ నిర్ఘాంత పోయింది ఆ రాజకుమారి. పక్కున నవ్వనారంభించింది. ఈ సంగతి తెలిసి రాజావారు అక్కడికి వచ్చారు. ఆ శుభవార్త కోటలోని జనానికి ప్రాకింది. వెంటనే, అంతఃపురవాసులంతా అక్కడికి హాజరయ్యారు. రాజకుమార్తెలో, ఇంతవరకు దాగియున్న నవ్వంతా ఒక్కసారిగా బయట పడినట్టుంది. అక్కడి వింతలన్నీచూసి, వచ్చినవాళ్లుకూడా కడుపుబ్బేలా నవ్వసాగారు.

రాజు, రాణి చాల సంతోషించారు. ఇన్నాళ్లనుండీ వాళ్లుపడే వేదనకు అంతు లేదు. ఆ రోజుతో వాళ్ల కష్టాలన్నీ తీరిపోయినట్లు భావించారు. దేవుళ్లకు మొక్కేరు. తమముద్దుబిడ్డ ఒక సంసారియై తమ రాజ్యలక్ష్మికి శోభ తేగలదని ఆనందించారు. రాజావారు ఆయువకుని చేరబిలిచి,

రాజు:-ఓయీ! నీ నేర్పరితనానికి మెచ్చుకొన్నాము. మా అమ్మాయికి తగిన భర్తవు నీవే. ఆ పిల్లను పెండ్లిచేసుకొన నీకిష్టమేనా?

రాజకుమార్తె వైపుకు తిరిగి -

రాజు:-"ఏమమ్మా! ఈ యబ్బాయి నీకు నచ్చినాడా పెండ్లాడుదువా?" అని ప్రశ్నించగానే ఆ యిద్దరూ తలలూపారు. మంచి ముహూర్తాన ఇద్దరికీ వివాహమయింది. రాజు, యువరాజు, యువరాణి మహోత్సవం కూడా జరిపారు. రాజు, రాణి బంధుమిత్రులు, యావన్మంది ప్రజలు సంతోషించారు.

(జర్మను జానపద గాథ)




శ్రీ పిల్లా సుబ్బారావుశాస్త్రి

సుబ్బారావుకి వుద్యోగం యెక్కడా దొరకలేదు. చెయ్యాల్సిన ప్రయత్నాలన్నీ చేశాడు, కాని లాభం లేకపోయింది. చివరికి గుమాస్తా ఉద్యోగంకూడా దొరకలేదు.

తిరిగి మూలపడేసిన వీణతీసి, దుమ్ముతుడిచి ప్రయివేట్లు చెప్పుకుందుకు బయలుదేరాడు. చిన్నప్పుడు నేర్చుకున్నాడు సంగీతం!... అదేపనికొచ్చిందిప్పుడు! ... సుబ్బారావు సంగీతంకూడా బాగా నేర్చుకున్నాడు.

శేఖరంగారమ్మాయి పద్మావతి. పద్మ మంచి యోగ్యురాలు, విద్యార్థిని! ... పద్మకి సుబ్బారావు ప్రయివేటు చెబుతూవుండేవాడు. - పద్మ హృదయం చాల మృదువయినది. అందులోనూ స్త్రీ! ... ఆమె సుబ్బారావు దుస్థితిచూసి జాలిపడేది. ఆయనకి చాలా సహాయం చేస్తూవుండేది! ...

సుబ్బారావు ప్రయివేటు చెప్పేందుకువచ్చాడు. పద్మ చాపకోసం వెదికింది; కనిపించలేదు! ... "ఏమండీ! మీరలా కుర్చీలో కూర్చోండి; నేక్రింద కూర్చుంటా"నన్నది పద్మ. సుబ్బారావు 'సరే'నని కుర్చీలో కూర్చున్నాడు.

పాఠం అయిన తర్వాత గభాలునలేచాడు సుబ్బారావు ... "ఫర్ ..." మన్నాది పాంట్ ... అసలే పాతది, కొయ్యకుతగిలి చినిగిపోయింది. సుబ్బారావుకు చాలా సిగ్గేసింది! ఎలా వెళ్ళడం?... పట్టపగలు ... మిట్టమధ్యాహ్నం మాత్రంగాదు!...

"ఉండండి! ..." అన్నాది పద్మ. సుబ్బారావుకు భయంవేసింది. ఈ ఫంట్లాంతో బయటకెలా వెళ్ళడం? ... ఏంచెయ్యడం? ఎలా వెళ్ళడం?... ఇంతలో పద్మవచ్చి "ఇదిగో, తీసుకోండి!" అన్నాది, ఒక పంచయిస్తూ.

"అబ్బే! వద్దులెండి! ... ఇంటికివెళ్ళి మార్చుకుంటాను" అన్నాడు సుబ్బారావు. అన్నాడేగాని యింటిదగ్గర పెట్టెలో, తయారుగా వున్నాయా? చాకలాడి దగ్గర అద్దెకు తీసుకోవాలి! ... "ఫర్వాలేదు; తీసుకోండి" అని చేతికిచ్చింది భయపడ్తూ పద్మ.

"అలా, వెళ్ళి నా గదిలో మార్చుకోండి! ..." అన్నాది డ్రస్సింగ్ రూమ్ చూపిస్తూ. సుబ్బారావు పాంటువిప్పి, పంచ కట్టుకున్నాడు.

"అదిలా, యివ్వండి! ... కుట్టి యిస్తాను" అన్నాది పద్మ. - అతికష్టంమీద తన పాంటు ఆమెకిచ్చాడు. - ఆ రోజు పద్మావతి పంచయివ్వకుంటే, అతనిలా తలెత్తుకు యీ వూళ్ళో తిరిగేవాడా?

ఆగష్టు పదిహేను! ... స్వాతంత్ర్య దినోత్సవం! ... వూళ్ళో త్రివర్ణపతాకాలు ఎగురుతున్నాయి. - పద్మావతి ఏదో తియ్యనికలలు కంటోంది! ...

"ఏమే... అచ్చీ! అయితే సంగీతం మాష్టార్కి పెళ్ళిఅయిందా?" అని అడిగింది పద్మ పనిమనిషి అచ్చిని.

"అబ్బే ... యింకా అవలేదమ్మా ! ... అతనికే లేదూ, తింటానికి తిండ్ ... పెళ్ళికూడానా ?" అన్నాది అచ్చి.

"నీకు తెలీదులేవే ! ... అయ్యేవుంటుంది" అన్నాది పద్మ. పద్మకి యింకా అనుమానమే ! ... ఇంతకీ సుబ్బారావుకి పెళ్ళి అయిందా ? లేదా ? ఎలా తెల్సుకోవడం ? ...

సుబ్బారావు పాఠంచెప్పడం పూర్తికాగానే లేచాడు. "ఈ గౌను, మీ అమ్మాయికివ్వండి! ..." అన్నాది పద్మ.

"అమ్మాయా ? ... "

"అవును ! ... అమ్మాయికివ్వండి ! ... ఏం ? మీకు పిల్లలు లేరా ? ... "

"పిల్లలా ! ... ఇంకా పెళ్ళికానిదే ... " అన్నాడు సుబ్బారావు. పద్మ ఫకాలున నవ్వింది. అతనూ నవ్వేడు.

సుబ్బారావు ఒక రోజు ప్రొద్దున్నే వచ్చాడు. "ఏమోయ్ ! ... ఇలా వచ్చావ్ ?" అని అడిగారు వార్తాపత్రిక ముఖంమీదనుంచి క్రిందకుదింపి.

"ఏంలేదండీ ! ... " నసిగాడు సుబ్బారావు.

"చెప్పవోయ్ ... నా దగ్గర సిగ్గుదేనికీ ?" — చుట్ట చప్పరించారు శేఖరంగారు.

" ... ... "

"ఊఁ ... మాటాడవోయ్ ... !"

" ... నాకో ... చిన్న సహాయం ... "

"ఏమిటో, ఆ సహాయంచెప్పూ ! ... చేతనయితే చేస్తాను."

"అఱవై రూపాయలు కావాలండీ!" అన్నాడు భయపడ్తూ, నొక్కుతూ, నక్కుతూ సుబ్బారావు.

"అఱవైరూపాయిలు ! ... Impossible ... ! ఇప్పుడు దొరకడం కష్టం !" అన్నాడతను.

"మీరులేదంటే యెలాగండీ ? ... మీ రిచ్చిన అరవయి రూపాయిలూ ఆఫీసర్కుకడితే, నూట యాభై రూపాయలమీద వుద్యోగం దొరుకుతుంది!... అమ్మాయిగారికి ప్రయివేటుచెప్పో, లేక మొదటి జీతం తీసుకునో, యిచ్చేస్తాను" అన్నాడు సుబ్బారావు గుక్కతిప్పుకోకుండా !...

"అవునయ్యా ! నువ్వు ఎగవేస్తావనిగాదు. నా దగ్గరలేదుకదా !" అన్నారు శేఖరంగారు. ప్రక్కగదిలో తలుపుచాటున నుంచొని వింటోంది పద్మ.

సుబ్బారావు ఆశ నిరాశ అయింది. ఆ వుద్యోగం తనకి దొరకడంకల్ల ! ... సాయంత్రం ప్రయివేటుకు బయలుదేరాడు.

ప్రయివేటు పూర్తి అయిన తర్వాత, "ఉండండి! ... వస్తాను" అని చెప్పి క్రిందకు వెళ్ళింది. శేఖరంగారు ఎక్కడికో బయలుదేరారు.

"నాన్నా ! ... "

"ఏమమ్మా ... పద్మా ? ... "

"నాకో అరవై రూపాయలు కావాలి నాన్నా!"

... అంది బుంగమూతిపెట్టి పద్మ.

"దేనికీ ?"

"పిక్నిక్‌కి వెళ్ళాలి ! ... అందుకు ... " అన్నాది పద్మ క్షణం ఆలోచించి.

"అరవయి రూపాయలూ తీసుకోగాని ... పిక్నిక్‌కి మాత్రం వెళ్ళకు ... - రామనాథంగారబ్బాయి, పిక్నిక్‌కి వెళ్ళి చచ్చిపోయాడు సముద్రస్నానంచేస్తూ ... " అంటూ అరువది కాగితాలు తీసి పద్మ చేతిలో పెట్టాడతను.

"సరే"నని మేడమీదకు తుర్రుమన్నాది పద్మ. - "తీసుకోండి... !" అంటూ పది కాగితాలు, ఆయనచేతిలో పెట్టింది.

"దేనికీ ? ..."

"ప్రొద్దున్న నాన్న నడిగేరుగా ...!"

"ఆయనిచ్చేరా ? ... "

"ఊఁ...హుఁ... నేనేయిచ్చాను !... ఆయనతో అనకండి!" అన్నాది పద్మ. - సుబ్బారావు క్రింది తండ్రీ కూతుళ్ల సంభాషణవిన్నాడు... కాని అడిగేడు ఊరికే ... !

సుబ్బారావు అరవయిరూపాయలూ ఆఫీసర్ కు లంచంకట్టేడు ! ... ఉద్యోగందొరికింది. జీతం నూట యాభైరూపాయలు ! ...

"పద్మయెంతమంచిది ... ? నేనంటే పద్మకి ఎందుకంత ప్రేమ ... ? ! నన్ను ప్రేమిస్తోంది ... ! పద్మ తండ్రి, పద్మా ఒప్పుకుంటే పద్మకి దాసుణ్ని అయిపోతాను ! ... ... పద్మనే వివాహంచేసుకుంటాను ! అలాగయినా, ఆమెఋణం తీర్చుకుంటాను ... ఆమె తిరిగి అరవైరూపాయలూ యిస్తే వద్దన్నాది ... ! ఎంత ప్రేమ ... ?" అనుకున్నాడు సుబ్బారావు.

అబ్బ ... బ్బ...! ఎంతగామారిపోయాడు... ? అసలు సుబ్బారావేనా ... ? ఆఁ ... వాడే ... ! పద్మని పెళ్ళిచేసుకోవన్నాడు ... ! నిజం ... ! అఖ్ఖర్లేదన్నాడు ... !!!

పద్మ సుబ్బారావుని ఎంతగానో ప్రేమించింది...! అంతేకాదు, అతనికి సహాయంచేసింది ... ! ఆ వుద్యోగం యిప్పించింది పద్మే ... !

శేఖరంగారు అడిగేరు సుబ్బారావుని, పద్మని పెళ్ళిచేసుకోమని .... మొదట 'సరే' అన్నాడు. తర్వాత 'అఖ్ఖర్లేదు' అన్నాడు.

అవును...! డబ్బు... ఎంతపనయినాచేస్తుంది...! మానవుడికి కావల్సింది డబ్బు ... ! డబ్బులేనిదే జీవించలేడు ! ... వాడి ప్రాణాలుతీసేది డబ్బు ! ! పచ్చని సంసారాల్ని కూల్చేది డబ్బు ... !! అంతా డబ్బు మహిమ ...

సుబ్బారావు గొప్పింటిపిల్ల 'దేవి'ని చేసుకున్నాడు. ఎక్కువకట్నం యిచ్చారు ... ! హాయిగా పెళ్ళిచేసుకున్నాడు.

పెళ్ళికి పద్మని పిలవలేదు ! ... ఛీ ! ... నీచుడు ... వాడికోసమే పద్మ తపించిపోయింది ! ...

పద్మ చాలా చిక్కిపోయింది ! ... ముఖం కళావిహీనం అయిపోయింది ! ... సంస్కారంలేనిజుట్టు, మాసిపోయిన బట్టలూ ... ఆమే నాకీ కథ ... గాధ ... చెప్పింది ...

"ఈ కథ మీరు రాస్తారా ?" క్షీణంగా అడిగిందామె. "అవును !" అన్నాను.

"ఎలా రాస్తారూ ?"

"ఇలాగే ..." అన్నాను.

"ముగింపు ఎలా చేస్తారూ ? ..."

"ఇలానే ! ..." అన్నాను. ఆమె కొంచెంసేపు, కొన్ని క్షణాలు ఆలోచించింది.

"అలా ముగించకండి ! ..." అన్నాది.

"ఏం ? ..." అన్నాను.

"బావుండదు ... ముగింపు నేచెబుతాను..." అన్నాది.

"చెప్పండి ! ..."

"ఇప్పుడు ... కాదు ... శ్రమ అనుకోకుండా రేపు మా యింటికిరండి ! ..." అన్నాది. 'సరే' అన్నాను.

మర్నాడు ఉదయం వాళ్ల యింటికి వెళ్ళాను, ఇంటిముందు జనం మూగివున్నారు. మధ్య మధ్య ఎర్రటోపీలుకూడా మెరుస్తున్నాయి ! ...

"చూశావా...ఎలాచేసిందో ! ..." అన్నారు శేఖరంగారు. - పద్మ యిలా చేస్తుందని నేను అనుకోలేదు ! ...

పద్మ స్లీపింగ్ టాబ్లెట్స్ వేసుకొని చచ్చిపోయింది ! ... ఆత్మహత్య ! ... కాదు సుబ్బారావు పద్మని హత్య గావించేడు.

"నా చావుతో ఎవరికీ సంబంధంలేదు. ఎవరూ నా చావుకి విచారించనక్కర్లేదు ! ... " అని చక్కగా రాసింది వుత్తరం ! ...

ఆమె డైరీలో మాత్రం, రాత్రి రాసినట్టుగావుంది ... "మగవాణ్ణి నమ్మకూడదు ... వాడి ప్రేమ వట్టి నటన ..." అని రాసివుంది ! ... పాపం ! ఆమె యెంత కష్టపడిందో ! ...

ఆమె నన్ను యిలా ముగించమని చెప్పడానికే రమ్మన్నాది వాళ్ళ యింటికి గామోసు ! ...

"టక్ ..." _ నాపాళీ చిట్లిపోయింది ...

——X——

# అంకెలా-సంఖ్యలా

శ్రీ క్రొవ్విడి అన్నంరాజుశర్మ

(గత సంచిక తరువాయి)

"ఆ తర్వాత... ...యీ పాషాణ మనస్కుడ్ని కూడా కరిగించివేయగల, పీల్చి పిప్పచేయగల సంఘటన ఒకటి జరిగింది. ఇందాక పదిసంవత్సరాలక్రితం జరిగిందన్నదదే. అదే నా యిప్పటి పరిణామానికి, వైఖరికి మూలాధారం. చాలా నెలలు గడిచాక ఓరాత్రి నేను పన్నెండు గంటలకు తిరిగివచ్చి మంచి నిద్రలోవున్నాను. క్రింద పెరట్లోంచి దభీలుమని చప్పుడు వినిపించి, ఉలిక్కిపడిలేచాను. ఆ గడబిడలో నేను సంశయిస్తూండగానే గంగమ్మ క్రింద నుంచి ఎలుగెత్తి ఏడుస్తూ కేకలువేయడం వినిపించింది. దీపాలన్నీ వెలిగించుకుంటూ క్రిందకు పరిగెత్తాను రొప్పుతూ. బావిదగ్గర నిలబడి ఆవిడ గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది. అరవింద బావిలో దూకేసిందని చెబుతోంది. నేను గబగబ కేకలువేసేసరికి నౌఖర్లంతా పరిగెత్తుకువస్తున్నారు. హఠాత్తుగా నాలో ఏదో సంచలనం చెలరేగింది. అది యిటువంటిది అని చెప్పలేను. కాని ఆ బాధ భరించటం ఎటువంటి మానవునికైనా దుస్సాధ్యము. టార్చిలైటు బావిలోకి వెలిగించి 'అరవిందమ్మతల్లీ!' అని వెర్రిగా అరిచాను. నీటి అడుగున ఏదో కదులుతున్నట్లూ, కొట్టుకుంటున్నట్లూ అలజడివల్ల తెలుస్తోంది. నేను ఉద్రేకాన్ని భరించలేకపోయాను. లోపలకు దూకివేద్దామని సంకల్పించాను. నా ఉద్దేశం గ్రహించి ఎవరో గట్టిగా పట్టుకుని ఆపుతున్నారు. వొణికిపోతూ అలా నీళ్ళలోకీ, ఆ చిన్న వెలుగులోకి చూస్తున్నాను. ఎవరేం చేస్తున్నదీ తెలియదు. ఎవరి రోదన వినిపించటం మానివేసింది. అలా రెప్పవాల్చకుండా చూస్తున్నాను. నీటిలో అలజడి తగ్గింది. క్రమక్రమంగా ప్రశాంతత ఆవరించి నిర్మలంగా వున్నాయి. నా చేతిలో దీపం చివరి వెలుగు వెలిగి ఆరిపోయింది. 'అరవిందా!' అని ఉన్మత్తునిలా అరిచి వెనక్కి వాలిపోయాను.

"తెలివివచ్చేసరికి ఎదురుగుండా పిచ్చితల్లి మృతకళేబరం. నేను చేసినతప్పే యీ శవంరూపంలో కళ్ళముందు మెదుల్తోంది. నిస్పృహతో 'అరవిందా, నన్ను క్షమించవూ?' అని నేలమీదపడి విలపిస్తూంటే, 'దౌర్భాగ్యుడా! ఇదంతా నువ్వే చేశావు' అంటూన్న గంగమ్మ చెల్లి దూషణ వాక్యాలు ములుకుల్లా బాధిస్తూ అస్థిమితుడ్ని చేసివైచాయి. ఆ రోజు ఎందుకంత ఏడ్చానో తెలియదు."

ధారావాహికంగా ప్రవహిస్తూన్న ఆ నేత్రాంచలాలను మూతపడకుండా బిగపడ్తూ "అప్పటినుంచి నాలో ... చచ్చిపోయింది. బ్రతకటం ఆరంభించాను. అనుక్షణం నన్ను ఏదో వేదన తొలిచివేయసాగింది. ఇదివరలో లోక క్షేమానికి వినియోగపడే ఏ వుద్యమానికీ నేను ఆదుకోనడం జరగలేదు. ఎవరైనా ఏదైనా సహాయంకోసం నన్నర్థిస్తే కసిరిగొట్టేవాడిని. నేను పిసినిగొట్టునుకాను. కాని లోకహిత కార్యక్రమం నాకు కంటగింపుగా వుండేది. చిట్టితల్లి ఆదుర్భర జీవితం భరించలేక ఆత్మహత్యకు పాల్పడినప్పటినుంచీ నా నైజం పూర్తిగా మారిపోయింది. భగవంతుడు నాకు కావలసినంత డబ్బిచ్చాడు. ప్రజోపకారంకోసం వుపయోగించక పోతే తగలపెట్టనా అది? ఈ నా పరివర్తనకు కారణం అరవింద. అందుచేత అరవిందలాంటి వ్యక్తుల్ని చూస్తే నా కన్నీళ్లూ, సానుభూతీ కట్టలు

తెగి ప్రవహించేవి. ... ఓ రోజు రాత్రి మనశ్శాంతి కోసం నదివొడ్డుకు వెళ్ళి తిరుగుతున్నాను. నది ఉధృతంగా ప్రవహిస్తోంది. నేను తప్ప ఆ సమయంలో, ఆ నిశీధినిలో ఎవరూ లేరనుకుంటున్నంతలోనే ఎవరిదో ఆకారం వడివడిగా, గజిబిజిగా పరిగెడుతూండటం లీలగా విలోకించి తృళ్ళిపడ్డాను. మారు ఆలోచనలేకుండా దగ్గరగా అరుస్తూ నదికి అభిముఖంగా నేనూ పరిగెత్తడం ప్రారంభించాను. నేనా? ముసలివాడ్నేకదా! ఆఖరికి ఎలాగో వగరుస్తూ వగరుస్తూ ఆ వ్యక్తిని పట్టుకున్నాక, స్త్రీ అని గుర్తించాక, నా దురవస్థ ఏంచెప్పను? ప్రపంచంలో నాకంటే ఎవరూ అట్టి స్థితిలోవున్న స్త్రీ యొక్క మనోవేదన గుర్తించలేరన్న సంకుచితాభిప్రాయం కలిగింది. ఆమెను ఊరడించి యింటికి తీసుకువచ్చాను. అప్పటికి పదిహేడేళ్ళయినా నిండని ముగ్ధ. ఇంచుమించు నా కుమార్తె వయస్సే. తన కథ వినిపించింది. రూపంలోనేకాక స్వానుభవంలోకూడా అరవిందతో పోలికలే. ఈ చిట్టి తల్లిని నా కడుపులోపెట్టి కాపాడాలనుకున్నాను. ఆమే కమల. ఇదీ నాలుగు సంవత్సరాల క్రిందటి సంఘటన.

రాజయ్యగారు చెప్పుకుపోవటం ఆపాడు. ఒకసారి కమలవంక ఆప్యాయంగా చూచాడు. ఇద్దరివీ ఆర్ద్రహృదయాలే అయినట్లయితే ఆ వారధిని విరగగొట్టగల సమర్థుడెవడు?

"ఇంతే నేను చెప్పగలిగింది. ప్రతివాడూ దేశోద్ధరణ, దేశోద్ధరణ అంటూ పాటుపడాలని నేను చెప్పను. పీడించి, బెదిరించి ఎప్పుడూ ఎవరినన్నూ లొంగదీసుకోవటం అవివేకం. ఏదో ఓ ఘట్టంతో, ఘటనతో చాంచల్యం వదిలిపోవాలి. మానసిక విప్లవంరావాలి. దీనికి సహనత తోడుకావాలి. ప్రతి ఒక్కడి జీవితంలోనూ యీ విప్లవం ఎప్పుడో ఒకప్పుడు తటస్థించటం తథ్యం. అది నిలబెట్టుకోవట మసాధ్యమని చింతించటం మానినప్పుడు శ్రేయస్సు అవతరిస్తుంది.

మరి ఒక్క విషయంచెప్పి ముగిస్తాను. అనాథలంటే నాకు అపేక్ష. కాని పతితులంటే, భ్రష్టులంటే నాకు సానుభూతిలేదు. అసహ్యంకూడా. తాను పతితఅయినందుకు ఏవో కుంటికారణాలు చెప్పేవ్యక్తి సన్నిహితత్వాన్ని నేను భరించలేను. ఇది నా స్వాభిప్రాయం. నైర్మల్యం నశించాక జీవితంలో ఆదర్శానికి అర్థంలేదు. నాది ఆదర్శం కాదు, ఆరాటం. ఇంతే."

చాలా గంభీరమైన దశలో సభ ముగిసింది. అందరూలేచి, సెలవు పుచ్చుకునేవాళ్లు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోవటానికి ఉద్యుక్తులౌతున్నారు. కమల తండ్రివద్దకువచ్చి నిలబడింది. అంతలో ఒక వ్యక్తి వచ్చి రాజయ్యగారితో యిలా అన్నాడు. "మీతో నేనింతవరకూ మాట్లాడటం తటస్థించలేదు. ఇవేళ నాకెంతో ఆనందంగావుంది. మీరు సమ్మతిస్తే ఒక ప్రశ్న అడుగుదామనుకుంటున్నాను."

ఆ వ్యక్తికి నలభయిఏళ్ళు దాటాయి. బాగా సంస్కారంవున్న మనిషిలా గోచరిస్తున్నాడు. జీవితంలో బాగా అనుభవంవున్నవాడిలా వున్నాడు.

రాజయ్యగారు సవినయంగానవ్వి "అవశ్యం అడగండి" అన్నాడు.

"మీ చివరి వాక్యాలు నన్ను చాలా కలవరపరిచాయి. పతితజనోద్ధరణలో మీకు సద్భావంలేదనిపించింది."

"సారాంశం మనవిచేశాను. అది నా వ్యక్తిగత అభిప్రాయం. మానవుని శీలంలోవున్న విలువయందు నాకు విశ్వాసం పెరిగింది."

"వాస్తవమే. మీరు వారిపట్ల అంత ఏహ్యభావం ప్రదర్శించడం సమంజసంకాదేమో. వితంతు వివాహాలను మీరు ఆమోదిస్తారుకదా. మీరు అన్న పతితకు ఆ స్వరూపం యిచ్చింది యీ వివాహాలను అభ్యంతరము కలిగించటమే కొంతవరకూనని ఒప్పుకుంటారా?"

"కావచ్చు. నేను అవినీతిని భరించలేను."

ఆ వ్యక్తి నీరసంగానవ్వి "ఇంత నిండు సభలో మీ స్వరూపాన్ని మీరు అంత వివరంగా వెల్లడించుకోవటంలోగల సాహసాన్ని అభినందించక తప్పదు." అని యింకోమాట తప్పిస్తూ "ఈమేకదూ మీ కమల. పునర్వివాహంచేశారా ?" అని అడిగాడు. ఈ మాటలువిని కమల తటాలున ముఖం ప్రక్కకు త్రిప్పుకోవటమేకాక, ఆ సంభాషణ నాలకించటంలో ఏమీ ఆసక్తి కనపర్చలేదు.

"మన దేశంలో ఎటువంటి మనుష్యులున్నారంటే ?" అన్నాడు రాజయ్యగారు. "ఆశయానికీ, స్వలాభానికీ ముడిపెడతారు. కాలం పురోగమిస్తోంది. అనేక నవీన సాంప్రదాయాలు అవతరిస్తున్నాయి. అయినా ఎప్పటికప్పుడు అన్నీ సరిక్రొత్త. పదిమందిచేసిన ఒక కార్యం పదకొండోవాడికి యింకా నూతనంగానే, అబ్బురంగానే కనబడుతుంది. ఈ దురసంశయం నశించాలంటే మానసికంగా వ్యక్తులు పరివర్తనచెందిపోవాలి. దీనినే మానసిక విప్లవం అంటాను నేను. అది యిప్పుడప్పుడే జరిగేపనికాదు. కమలపెళ్ళి ...తగిన వరుడు దొరికినప్పుడు తప్పకుండా జరుగుతుంది."

ఆ వ్యక్తి సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు. రాజయ్యగారు కమలకేసి చిరునవ్వుతో చూసి "కమలా నీకు కోపం తెప్పించానా ?" అన్నాడు.

కమల యిటు తిరిగి "ఔనండీ నాన్నా. మీరు ఎన్ని రహస్యాలు యిన్నాళ్ళూనాకు చెప్పకుండా దాచుకున్నారో. రండి. అక్కయ్యను దగ్గరగా పరిశీలిద్దాం ?

రాజయ్యగారు కొద్దిగా చలించి "సరేపద" అన్నాడు బరువుగా నిట్టూర్చి. వాళ్ళిద్దరూ చిత్రపటం దగ్గరకు చేరేసరికి అధ్యక్షుడు సమీపానికి వచ్చాడు. "ఇవేళ అంతా విచిత్రంగా జరిగింది. అద్భుతమైనరోజు" అన్నాడు తనూ వాళ్ళతోకలిసి ఆ ప్రశాంతమూర్తివంక తిలకిస్తూ.

"నాన్నా ! నాకు యింతనుంచి అక్కయ్యవుందని యిన్నాళ్ళూ చెప్పారుకాదేం ? నా బొమ్మను చూసుకుంటున్నట్లుగావుంది ?"

"నేను దాచిపెట్టానా తల్లీ ? అది కాలంచేసిన పని. ఇప్పుడూ కాలమే వెలికి తీసుకువచ్చింది."

"ఈ నాటినుంచీ మా యింటికి యిది ఓ అలంకారం." అన్నాడు అధ్యక్షుడు.

రాజయ్యగారి పెదవులపై ఓ మందహాసం కదిలింది. ఎవరూచూడకమునుపే ఎంతత్వరగా అవతరించిందో, అంత త్వరగా అంతర్హితమైంది.

కమలయింకా అక్కడే నిలబడి సవినయంగా, జాలిగ పరిశీలిస్తోంది ఆ సుందరమూర్తివంక. తండ్రి హస్తంభుజంమీద మెల్లగా పడేసరికి "పోదామంటారా నాన్నా ?" అంది బాధతో.

"నీకిష్టంలేకపోతే కొంచెంసేపు ఆగుదాం"

కమల ఆయనకేసి తిరిగి, తడిరెప్పలతో చూసి "పదండినాన్నా !" అంది.

సింహద్వారందాటి వెలుపలికివచ్చేసరికి చీకటి ముసక మసగ్గావుంది. శీతాకాలం వెళ్ళి వేసవి ప్రవేశిస్తున్నాయింకా చలిచలిగానే వుంటోంది. సభకు వచ్చినవాళ్ళంతా వెళ్ళిపోవడం యింకా పరిసమాప్తి చెందలేదు. రాజయ్యగారు బయటకు రావటంచూసి డ్రైవరు కారుతీసుకువచ్చి ద్వారంముందు నిలిపాడు. కమల వెళ్ళి వెనక సీట్లోకూర్చుని తండ్రికోసం ఎదురు చూడసాగింది. ఆయనకూడా అధ్యక్షత వహించిన వ్యక్తి దగ్గర సెలవుతీసుకుని, మెట్లుదిగి, కారు దగ్గరకు రాబోతూండగా ప్రక్కనుంచి ఎవరో పిలిచారు.

ఆ పిలిచినవ్యక్తితో మాట్లాడడం పూర్తయేసరికి అయిదునిమిషాలు పట్టింది. మెల్లగా యివతలకు వస్తున్నాడు. జనసందడి యింకా తగ్గలేదు. హఠాత్తుగా ఓవికటహాసం వికృతంగా వినిపించింది.

"బ్రదర్ ! సంస్కర్తగారి వచనంబులాలకించితివా ?"

"ఊరుకోవోయి, వింటాడు ?

"పతితలంచే అనహ్యమట, తనకూతురు చేసిన పని ఏమిటో !"

"కూతురంటే? కమల విషయమేనా?" అంది చీకటిలో మూడోగొంతు.

"కాక యీవిడగారుమహా పతివ్రతా ఏమిటిగాని, ఆ నూతిలోపడి చచ్చిపోయిన కూతురు విషయం నేను చెబుతూంది - గ్రంధసాంగురాల్లే.

"ఛీ ఛీ. చచ్చి స్వర్గాన వున్నవారినిగురించి నింద చేస్తావుట్రా అప్రచ్యుడా! నీకిందేం పొయ్యేకాలం?"

"అవునులే మరగించిన వాళ్లంతా మహామహులనటం మనలో పరిపాటేగా. ఉత్తమ యిల్లాలు— మహాసాధ్వి. వాకిట్లోకి కాలు పెట్టి ఎరుగని విధవరాలు. అల్ల, ఆ శివాలయం వీధిన కొత్తగా మేడ కట్టాడే" ఆ నరశింహం పదేళ్ళక్రితం యువకుడేలే, యిదివరకు వీళ్ల మేడప్రక్కన వుండేవాడు. పుణ్యం కట్టుకున్నాడు ?

"ఏమిటీ - నలుగురు బిడ్డలతండ్రి ?"

"ఇప్పుడూ !"

చీకటి నాలుగు కొంతుకలనవ్వుతోంది. రాజయ్యగారు శిలాప్రతిమవలె అలానే నిల్చుని వుండిపోయాడు. కారులోదీపం వెలుగుతోంది "నాన్న! త్వరగా రావేం నాన్నా !" అనికమల పిలుస్తోంది తొంగి చూస్తూ.

ఒక అడుగువేశి, తూలి క్రింద బడపోయాడు. ప్రక్కనున్న గోడని ఆధారం చేసుకుని సంబాళించుకున్నాడు. మెల్లగా, అతిబరువుగా, కఠోరంగా. అడుగులు వేస్తూ కారులోకివచ్చి కూర్చున్నాడు వెలుగులో ఆయన ముఖంవంక తేరి పారిచూసి కమల భయవిహ్వలురాలైంది. "అదేమిటి నాన్నా ?" అని గొణిగింది కంపిత స్వరంతో.

ఆయనేమీ మాట్లాడలేదు. కనీసం తలత్రిప్పి అయినా చూడలేదు. అగ్నిలా జ్వలిస్తున్న నేత్రాలతో ఎవరూ అవలోకించలేని ఏదో అగాధాల్లోకి తీవ్రంగా చూస్తూ వుండిపోయాడు. ఆ విగ్రహాన్ని హఠాత్తుగా సందర్శించినపుడు ఎంతగా కఠినచిత్తుని గుండె అయినా సరే గడగడ వొణికితీరవలసిందే.

"నాన్నా !" అని పిలిచింది కమల భయంతో మళ్ళీ.

ఏమీ సమాధానం వెలువడలేదు. కమల యీసారి సంపూర్తిగా డోలాయమాన చిత్తంతో మూలను ఒదిగి భీతహరిణలా అణిగిఅణిగి ఆయన ముఖంలోకి చూసింది. మృదులమైన ఆ వదనం యినుములా రాటు తేలి క్రౌర్యాన్ని వెదజల్లుతోంది. ఆమె వణికిపోయింది. కిక్కురుమనకుండా కూర్చుంది.

కారు యింటి దగ్గరకువచ్చి ఆగాక కమల తొందరగాదిగి, తప్పటడుగులు వేస్తూ పైకివెళ్ళిపోయింది. రాజయ్యగారు తీక్ష్ణంగాచూస్తూదిగి, తన గదిలోకి వెళ్లాడు. దీపం వెలిగించబడింది. చుట్టూరా కలయజూశాడు. ఒక్కసారిగా ఆవేదన, దుఃఖం పెల్లుబికినట్లయింది. రెండు చేతుల్లో తలదాచుకుని, బావురుమంటూ ... ...

"ఊహు" అనుకుని మనసుకు ఎదురు తిరిగాడు. ఇది కర్కశమైన ఆవేశం. అరవైఏళ్ల వృద్ధునికి యవ్వన పురుష క్రోధాన్ని, కసినీకలిగిస్తూన్న ఆవేశం.

ఓ క్షణం గడిచింది. మనః క్షేత్రంలో ఒక ఉపన్యాసం జరుగుతోంది. పెద్దలంతా ఆసీనులై వున్నారు. అరవైఏళ్లునిండిన వృద్ధుడు అంటున్నాడు. అలాంటి వాళ్ళంటే నాకు జాలి. నా ప్రేమకట్టలు తెగిన ప్రవాహమౌతుంది. అటువంటివాళ్ళని చూసినప్పుడు ... ...

"ఎటువంటివాళ్ళని చూసినప్పుడు ?" సభలోంచి ఎవరో కేకవేశారు.

"అటువంటివాళ్ళని ... అంటే ..." జవాబు కోసం తడుముకుంటున్నాడు.

(సశేషము)

# ఏకాంతంగా కాంత

శ్రీ నాయుడు వెంకటసీతారామమూర్తి

రైల్వేప్లాట్‌ఫారం అంతా కిక్కిరిసిపోయింది. ప్రయాణీకుల కోలాహలం, సోడాకాయలచప్పుడు, పళ్లవర్తకుల కేకలతో ప్లాట్‌ఫారం సందడిగా ఉంది.

రాజు బెడ్డింగు వేసుకు కూర్చున్నాడు. చేతిగడియారం చూశాడు. రెండుగంటలయింది. ఇంకా మెయిల్ రాలేదు. ఎంత లేటో కనుక్కుందామని స్టేషనుమాష్టరు రూముకుదగ్గరగా వెళ్లేడు. బోర్డుమీద 90 నిముషాలు లేటని ఉంది. ఆ నిముషాల్ని గంట్లోకి మార్చుకున్నాడు. గంటన్నర లేటు.

రాజుకి ఏమీతోచిందికాదు. యింత కాలాన్ని గడపడంఎలా? పోనీ ఏదైనా చదువుకుందామంటే దగ్గరపుస్తకాలులేవు. వెంటనే డిటెక్టివ్ సాహిత్యంమీదకుదృష్టి వెళ్లింది. బుక్‌స్టాల్‌కివెళ్లి నవలలన్నీతిరిగేశాడు. "హత్యా? ఆత్మహత్య?" హత్యపై హత్య, బుట్టలో హత్య, జేబులో హత్య, హంతకుని హత్య, హైకోర్టులో హత్య, — ఏదీకొనాలోతోచింది కాదు రాజుకి. కాలక్షేపానికి ఏదో చౌకబారు సాహిత్యం! చదవాలిగా! చేతికొచ్చిన పుస్తకాన్ని తీసి అర్ధరూపాయి చిల్లర చేతిలో పెట్టి తన చోటులోకూర్చున్నాడు.

పేజీలు తిరగేస్తున్నాడు. కానీ దృష్టి పుస్తకంమీదకు మళ్లడంలేదు. ఎదురుగా ఉన్న ఎర్ర చీరమీద పడింది.

ఏకాంతంగా ఓ అమ్మాయి ఎదురుగా కూర్చునిఉంది. చేతిలో మరచెంబు, పక్కన బెడ్డింగు; మరోచిన్నసంచి. ఎర్రటి జార్జెటు సిల్కుచీర, ఊదారంగుజాకెట్టు, మెడలో నెక్లెసు, సన్నగా, ఎర్రగా, నాగరికత అబ్బిన అమ్మాయిలాగే కన్పిస్తున్నది. బెడ్డింగు పక్కగా కూర్చుని ఏమీతోచక దిక్కులు చూస్తోంది.

పుస్తకాన్ని చదవడం ఆపేశాడు రాజు. అమ్మాయిని తీక్షణంగా చూస్తున్నాడు.

ఈ వ్యవహారం అమ్మాయి కనిపెట్టింది. ముఖం పక్కకు త్రిప్పుకుంది.

పెద్ద షాక్ తగిలినట్టయింది రాజుకి.

యింతలో మెయిల్ వచ్చే వేళయింది. ప్రయాణీకులుకూడా హడావిడిగా సామానుసర్దుకుని బండికోసం ఎదురు

చూస్తున్నారు. ఆ మ్మాయి కూడా బెడ్డింగు ఒక చేత్తోను, సంచీ మరచెంబూ ఒక చేత్తోనూ పట్టుకుని నిలబడింది. రాజు కూడా తన ప్రయత్నంలో తానున్నాడు.

యింతలో బండిరానే వచ్చింది. దిగే వారు దిగుతున్నారు. ఎక్కేవారు ఎక్కుతున్నారు. ఆ అమ్మాయి ఓ చిన్న కంపార్టుమెంటులోనికి ఎక్కింది. రాజు నెమ్మదిగా ఆ పెట్టిలోనికే ప్రవేశించేడు. అమ్మాయి ఓమూలగా కూర్చుంది. అదృష్టవశాత్తూ దగ్గరగానే చోటుదొరికింది రాజుకి. అమ్మాయికి ఎదురుగా ఆశీనుడయ్యాడు. బండికదిలింది.

'చిత్రమైనది విధీనడతా' అంటూ పాడుతున్నాడు ముష్టివాడు. 'తాజాకజా– చాలా మజాగా ఉంటాయి అణాకి రెండు అని అరుస్తున్నాడు ఓ అర్భకుడు.

రాజు నాలుగు కాజాలు కొనుక్కున్నాడు. అమ్మాయివంక చూస్తూనే తింటున్నాడు. తింటూంటే దాహం వేశింది రాజుకి. అమ్మాయి చేతిలోఉన్నమరచెంబు గుర్తుకువచ్చింది.

“కాశిని మంచినీళ్లుయిస్తారా ? ”నిర్భయంగా అడిగేడు అమ్మాయిని.

యివ్వక తప్పిందికాదు అమ్మాయికి. మరచెంబు చేతికి అందిచ్చింది.

గబగబా ఖాళీచేశాడు మరచెంబుని. 'తేంక్సు' అంటూ తనచోటులో కూలబడ్డాడు.

ఆ కంపార్టుమెంటులో జనం మరీ రద్దీగా ఉన్నారు. ఓ అనాగరికవ్యక్తి త్రోసుకుంటూ వచ్చి అమ్మాయి పక్కనే కూర్చున్నాడు. జానెడు చుట్టనువెలిగించి అమ్మాయి వైపు పొగ దట్టంగా వదుల్తున్నాడు. ఆ పొగకు ఉక్కిరిబిక్కిరై ముఖాన్ని జేబురుమాలుతో దాచుకుంది. మరో ప్రక్క కూర్చున్న యువకుడు అమ్మాయి వంకచూస్తూ పళ్లికిలిస్తున్నాడు. ఎదురుగా కూర్చున్న ముసలాయన అమ్మాయి అవస్తనుచూసి జాలిపడ్డాడు. చుట్టకాల్చే వ్యక్తిని రాజు గదమాయిద్దామనుకున్నాడు కానీ పక్కస్టేషనులోనే ఆ వ్యక్తి దిగిపోవడంవల్ల తన ప్రయత్నాన్ని విరమించవలసివచ్చింది.

ఒంటరిగా ఒక స్త్రీ ప్రయాణంచేస్తే ఆమె పాట్లు భగవంతుడికే తెలియాలి. ఒకరు ఈలవేస్తారు. మరొకరు పళ్ళికిలిస్తారు. వేరొకరు పొగఊత్తారు.

ఛీ! పాడులోకం!

రాజు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. యింతవరకూ తాను చేసిందేమిటి? ఏకాంతంగా ప్రయాణంచేస్తున్న అమ్మా

యిని అనుసరించేడు. పట్టింపుగా ఆమెకు దగ్గరగా కూర్చున్నాడు.

యిదంతా ఎందుకు ?

తానేమైనా ఆ యువతిని ఆశిస్తున్నాడా? అటువంటి దురాలోచన తనకు లేదు. అందమైనవస్తువు కన్పిస్తే దానిని చూడడం వరకే ప్రతివానికీ హక్కు ఉంది. అనుభవించడానికి హక్కు లేదు.

తానూ అంతే.

అందమైన అమ్మాయి కన్పించింది. చూశేడు. యిందులో తప్పేముంది ?

తాను అనాగరిక వ్యక్తిలా అమ్మాయి ముఖంమీద పొగ ఊదలేదు.

రౌడీలా అమ్మాయినిచూసి పళ్ళికలించలేదు.

తనలోతాను సమాధానపర్చుకున్నాడు రాజు.

బండి ఓ స్టేషనులో ఆగింది.

ఆమెకు దాహంవేసినట్టుంది. మరచెంబుమూత తీసుకుని చూసింది. నీళ్లు లేవు.

అమ్మాయి అవస్థను అర్థం చేసుకున్నా రాజు.

"మంచినీళ్లు తెస్తాను మరచెంబు యివ్వండి" దగ్గరగావెళ్లి అడిగేడు.

అమ్మాయి మాట్లాడలేదు. మౌనంగానే మరచెంబు చేతికి అందిచ్చింది.

రాజు చెంబునిండా నీళ్లు తీసుకువచ్చేడు. ఆమె చేతికి అందిచ్చేడు.

'థేంక్స్' అంటూ పుచ్చుకుంది.

రైలు కదిలింది.

అమ్మాయి దాహం తీరింది.

రాజు సంతృప్తిపడ్డాడు.

ఇంతకు పూర్వం తనకు దాహంవేస్తే అమ్మాయి సహాయాన్ని అర్థించేడు. యిప్పుడు అమ్మాయికి తన సహాయాన్ని అందజేశాడు.

రైలు రాజమండ్రి స్టేషనులో ఆగింది. సామాను చేత్తోపట్టుకుని అమ్మాయి దిగిపోయింది.

ఆమెవంకచూస్తూ ఆలోచిస్తున్నాడు రాజు. నెమ్మదిగా అమ్మాయి నడిచిపోతోంది. దూరంగాపోతూ రాజు కంటికి అదృశ్యమైంది.

---

# స్త్రీలు - గ్రామపునర్నిర్మాణము

శ్రీ గాడేపల్లి శంకరం

నూటికి డెబ్బదివంతులు గ్రామజీవితం గృహిణుల మీద ఆధారపడివుంది. గ్రామస్థుడు పొలంమీద శ్రమపడి పనిచేస్తూ పగలంతా చమటోడ్చి సంపాదిస్తాడు. ఇంటికి తీసుకవచ్చి పడేస్తాడు. అంతవరకే అతని బాధ్యత; మిగతాయావత్తు పనినీ గృహిణి చక్కబెట్టుతుంది — పొదుపుచేసి సంసారాన్ని బాగు చేయనూగలదు — దుబారాచేసి ఇల్లును గుల్లచేయనూగలదు. భర్తను పిల్లలను పోషించడంలోగాని— పిల్లలను చక్కని పౌరులుగా తయారుచేయడంలోగాని ఇంటిని ఆరోగ్యవంతముగా ఉంచటములోగాని — ఇల్లాలు చేయవలసినపని ఇంతా అంతాకాదు — బోలెడంత. ఇంగ్లీషులో ఒక సామెతవుంది. "The hand that rocks the cradle will rule the world." అని. అంటే "ఊయల ఊపిన చెయ్యే ఊళ్లుకూడాఏలుతుందీ"అని. ఇందులో సత్యదూరమైనది అవంతకూడా లేదంటే నమ్మండి.

సారవంతమైన పంటలు పండించుకోవడం — పండించినసరుకును పరపతి సంఘాలద్వారాఅమ్మకొని సొమ్ము చేసుకోవడం — పరిశుభ్ర వాతావరణములో ప్రశాంత జీవితాన్ని గడపటం — గ్రామస్థులు నేర్చుకోవాలంటున్నాము. ఇది ఒక్క మొగవాడిమీదనే ఆధారపడిలేదు. అతడికి నవీనపద్ధతులునచ్చిన ప్రయోజనంలేదు — అతడు అనుసరించే పద్ధతులు అతని భార్యకుకూడా నచ్చాలి. ఆమెకు నచ్చచెప్పాలి. అప్పుడుగాని ఆమె అతనితో సహకరించి పని చేయదు. ఆమె సహకారములేనిదే అతడు ఏమీ చేయలేడు — ఆచారవ్యవహారములు — అలవాట్లు— ఆడవాళ్లను అంటిపెట్టుకొనివుంటాయి. వాటిలో మార్పుకీ — చేర్పుకీ ఆడవాళ్లు అంగీకరించాలి. వాళ్లు అంగీకరిస్తేనేగాని — మార్పుకి అవకాశంవుండదు. చేర్పుకీ వీలుండదు.

స్త్రీలు పూర్వకాలపు పద్ధతులతో పూర్తిగా వున్నారని అనటము సాహసమే అవుతుంది. అయితే ఆధునికి పద్ధతులు అన్నీ అవగతంచేసుకున్నారా అంటే అదీ శూన్యమే — పూర్వకాలపుపద్ధతులను పూర్తిగా ఆచరించటంలేదు. ఆధునిక జీవిత విధానానికి పూర్తిగా అలవాటుపడలేదు.

అధునాతనపు పద్ధతులను—సనాతనపు పద్ధతులకు సమన్వయపరచి పునర్నిర్మాణము జరుగవలసివుంది— ఈ రెండు పద్ధతులు ఆడవాళ్ళకు సంపూర్ణంగా తెలిస్తేనేగాని పునర్నిర్మాణం సాధ్యంకాదు — సనాతపు పద్ధతులుకూడా పూర్తిగా తెలిసివుండాలి — అధునాతనపద్ధతులు అనుసరించేటందుకు ఉత్సాహం వుండాలి. ఇవి ఆడవాళ్లు పూర్తిగా అర్థంచేసుకోవాలి. వాటికీ వీటికీ ఉండేతేడా — వాటిలో — వీటిలోఉండే, మంచి చెడ్డలు, లాభనష్టాలు అర్థమైతేనేగాని అనుసరించటానికి ఒప్పుకోరు.

మనపిల్లలు ఎన్నో కొత్త విషయాలు బడులకు పోయి నేర్చుకుంటున్నారు. ఇంటికి వచ్చి యథాప్రకారంగా పాత జీవితవిధానాలనే అనుసరిస్తున్నారు. ఒక్క చిన్నపిల్లలేకాదు — పెద్దచదువులు నేర్చిన విద్యావంతులూ అంతే — దీనికి గలకారణం, ఇంటగలస్త్రీలు — ఇంటగల స్త్రీలలో మార్పు వస్తేనేగాని ఇంటా బయటాకూడా మార్పుకీ—చేర్పుకీ అవకాశంలేదు. నవ్యజీవిత విధానాలు వారికి తెలి

స్తేనేగాని—ఇల్లు పల్లెకూడా పునర్నిర్మించటానకి సాధ్యపడదు. అందుచేత ప్రతిగ్రామంలోను ఒకస్త్రీ సమాజమును నెలకొల్పవలసివుంది. ఆగ్రామంలోని స్త్రీలందరు ఆసమాజంలోసభ్యులుగా చేరిసమస్తవిషయాలు తెలుసుకోవాలి — సభ్యతగలస్త్రీలు — చదువునేర్చిన స్త్రీలు తోడి స్త్రీలకు నేర్పవలసివుంది. సనాతనపు పద్ధతులను గౌరవించమనీ, వాటిని నామరూపాలు లేకుండా నాశనంచేయడం మార్పుఅనిపించుకోదనీ— అది పునర్నిర్మాణము కానేకాదనీ, నవీనపద్ధతులు - కాలానుగుణ్యముగ అనుసరించవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నదనీ విద్యాగంధములేని స్త్రీలకు విద్యావంతులైన స్త్రీలు చెప్పి ఒప్పించాలి.

సత్యము - ధర్మము - ఆచంద్రార్కము ఒక్కతీరునేవుంటాయి - కాని వాటిని అనుసరించవలసిన విధానములోనే - కాలానుసరణముగా మార్పులు-చేర్పులు వస్తూవుంటాయి - వాటిని కాదని బ్రతుకటం కష్టం - కాలప్రవాహానికి ఎదురీది మనము సాధించేది ఏదీవుండదు. సాటిదేశాలతో సభ్యమానవుల వలె ప్రవర్తించకపోతే - అజ్ఞానాంధకారంలో పడి అలమటించవలసివస్తుంది. అందుచేత ఈ విషయాన్ని స్త్రీలు ఎంత త్వరితంగా గుర్తిస్తారో - అంతత్వరితంగానూ - సులభంగాను సాంఘికవ్యవస్థను మార్చటానికి వీలవుతుంది. స్త్రీలలో బహుళప్రచారానికి స్త్రీలే తగుదురు - కనుక ప్రతిగ్రామంలోనూ స్త్రీ సమాజములు ఏర్పాటు చేసి తీరాలి. విజ్ఞానవంతులైన స్త్రీలు విద్యావిహీనులైన స్త్రీలకు జ్ఞానోదయం కలిగించాలి. ఈ నాటి గ్రామాలు ఇంతఅపరిశుభ్రంగాను - అనారోగ్యకరముగాను వుండటానికి కారణం స్త్రీలే: పిన్నలుగాని పెద్దలుగాని ఎన్నిచదువులు చదివినా, ఎన్నివిషయాలు నేర్చినా - ఇంటమాత్రం అమ్మమ్మల్నే అనుసరిస్తున్నారు. వారి అలవాట్లకు ఆచారవ్యవహారాలకే తలయొగ్గుతున్నారు. ఈ పరిస్థితి మారటానికి స్త్రీ విద్యావంతురాలై వుండాలి. విజ్ఞానసముపార్జన చేసుకోవాలి. పాత కొత్తలమేలుకలయికను అర్థంచేసుకొని అనుసరించాలి.

నూతన పద్ధతులు అనుసరించి గృహయజమాని అధికంగా డబ్బు సంపాదించుకువచ్చినా - గృహిణి సవ్యంగా ఉపయోగించలేనప్పుడు - ఆ అర్థమంతా వ్యర్థమేగా అవుతుంది! పొదుపు నేర్చుకోవలసినది స్త్రీలు - దుబారా ఖర్చులు మానిపించవలసినది స్త్రీలు — డబ్బును నగలరూపంలోను ఇతర నిష్ప్రయోజనపు వస్తురూపంలోను — మూలగనియ్యకుండా వుంచవలసినది స్త్రీలు, కొత్త డబ్బుతో ఇంకా మరికొంత డబ్బును సంపాదించే మార్గాలు ఆలోచించవలసినదీ స్త్రీలే. ఇవి ఆమెకు తెలియనప్పుడు — అదనపు డబ్బు వచ్చినందువల్ల నష్టమేకాని లాభం వుండదు. సంసారపు ఖర్చులు లెక్కవ్రాసుకోవడం— డబ్బును బాంకులో దాచుకోవడం — స్త్రీలు తెలుసుకోవాలి. ఈ విషయములు స్త్రీలు తెలుసుకుంటేనే గాని పురుషుడు ఎంత ఆసక్తిచూపినా ప్రయోజనం వుండదు. మంచి విత్తులు తెప్పించినా — బలమైన పశువులను కొందామనినా—కొత్త పద్ధతులమీద వ్యవసాయం సాగిద్దామనుకొన్నా — ఇంటిని శుభ్రంగా వుంచుదామన్నా — ఆకర్షణీయంగా అన్నీవుంచి — ఆదర్శజీవితం గడుపుదామన్నా — తన భార్య కలిసి రానప్పుడు ఏమిలాభం? ఏమీచేయలేదు. అందుచేత తన ఇంటగల స్త్రీని అన్ని రంగాలలోను తర్ఫీదు చెయ్యాలి — ఆరోగ్యపద్ధతుల్లోనైతేనేమి — ఆర్థిక విషయాలలోనేమి-సాంఘిక రాజకీయ సంగతులైతేనేమి — ఆమెకు పూర్తిగా తెలియచెయ్యాలి. అన్నింటికీ చదువురావాలనేది అవసరంలేదు — ఇప్పుడు ప్రతి గ్రామంలోను రేడియోలలో ప్రభుత్వంవారు ప్రతి విషయం ప్రచారం చేస్తూన్నారు — వినికిడివల్ల విజ్ఞానాన్ని సంపాదించవచ్చు — సత్సాంగత్యమువల్లనైతేనేమి — సమాజములో సభ్యురాలైగాని — సమస్త విషయాలు తెలుసుకోవచ్చు — నిశానీదారులు నిఖిల ప్రపంచాన్నీ ఏలినవాళ్లున్నారు — ఓనమాలు వస్తేనేగాని చదువుకున్నా స్త్రీలలో జమకాదని చెప్పటం సబబుకాదు - విద్య అంటే విజ్ఞానం. విజ్ఞాన సముపార్జన అక్షరాలతోనే అవసరంలేదు - పురాణ

శ్రవణం — హరికథా కాలక్షేపం — రేడియో ఉపన్యాసములు- నాటక ప్రదర్శనాలు — సమాజ సభ్యులతో సాంగత్యము మొదలైనవి స్త్రీలకు విద్యనిచ్చి విజ్ఞానవంతులగా చేస్తాయని చెప్పటానికి ఏమీ సందేహం లేదు — ఓపికవున్నా స్త్రీలు — తీరుబడి వున్నా ఇల్లాండ్రు — అక్షరజ్ఞానాన్ని సంపాదించినా మంచిదే — విజ్ఞానవంతులైన స్త్రీలు తమ పిల్లలను విద్యావంతులుగాను — విజ్ఞానవంతులుగాను చేయగలుగుతారు. భావిపౌరులు కాగల ఈ పిల్లలు — నవ భారత నిర్మాణానికి పూనుకుంటారు.

కులతత్వపుకుళ్లు — మతతత్వపుకుట్ర — మడ్డి జీవితం మొద్దుస్వరూపాలు — అనారోగ్యానికీ — అవిద్యకీ — అనాగరికతకీ చిహ్నాలు — ఇవి స్త్రీలలో లేకుండా చెయ్యాలి — అప్పుడు గ్రామాలు బాగుపడు తాయి — దేశం ఉచ్ఛస్థితికి వస్తుంది.

నాటకాలు, సినీమాలు — హరికథలు — పురాణాలు — బుర్రకథలు — ఉపన్యాసములు — ఊరేగింపులు — రేడియో ప్రసంగాలు — పాటలద్వారా — ఊదరగొట్టినంత ప్రచారం ప్రతి ఊరులోనూ జరుగాలి — పునర్నిర్మాణం అంటే ఏమిటో — అది ఏవిషయంలో జరుగాలో - ఏవిధంగా జరిగితే బాగుంటుందో - స్త్రీలు తెలుసుకోవాలి - వాళ్లు పూనుకోవాలి.

గ్రామపునర్నిర్మాణంలో - స్త్రీలకి విజ్ఞాన సముపార్జన-బాల బాలికలకు చదువు - స్త్రీ సమాజముల స్థాపన — చాలా అవసరం - ఇవి ప్రతి గ్రామంలోనూ ప్రథమంగా ప్రారంభించవలసిన కార్యక్రమాలు. ఏదేశపు అభివృద్ధియైనా ఆ దేశపు ఆడవాళ్ల అభివృద్ధిమీద ఆధారపడి వుంటుందని పలువురు పెద్దలు అంగీకరించిన విషయం గనుక - ఈ విషయంలో ప్రథమంగా శ్రద్ధ తీసుకోవలసిన అవసరం వుంది - అది స్త్రీలే - అనగా సంఘసేవకులైన స్త్రీలే తీసుకుంటే పని త్వరగాను సులభంగాను జరుగుతుంది- ఆ గ్రామంలోగల బాల బాలికల జనాభా తియ్యాలి- స్త్రీలు ఎంతమందివున్నారో తెలుసుకోవాలి- వెంటనే ఒక పాఠశాల - స్త్రీ సమాజమందిరము ప్రారంభించాలి - ఆ ఊరగల బాలబాలికల నందర్నీ బడికి పంపించాలి — స్త్రీల నందర్నీ సమాజంలో సభ్యులుగా చేర్పించాలి — ఇంటింటికీవెళ్లి ప్రచారం చెయ్యటం ఒకటీ - వారానికోతూరి సమాజ మందిరంలో, సమావేశపరచి విషయబోధనము సాగించటం ఒకటీ - విడువకుండా జరుగాలి - ఏవి స్త్రీలను ఎక్కువగా ఆకర్షిస్తాయో - ఆ సాధనాలే తీసుకొని వారిలో ప్రచారం చెయ్యాలి - ఉచిత విద్యాసౌకర్యాలు ధనవంతుల తోడ్పాటుతో కలిగించి - పిల్లలకీ - పెద్దలకీకూడా చదువు నేర్పించాలి. ఆరోగ్య పద్ధతులు - ఇంటిపని — వంటపని — కుట్టుపని — చిన్నచిన్న చేతిపనులెన్నో వారికి నేర్పించవచ్చు - ఈ విద్యలన్నీ వారికి జీవనాధారముగా వుండాలి. లేదా వారింటిలో వారు చేసుకొనేవిగానైనా వుండాలి. ఆడపిల్లలకి చదువు - ఎలా వుండాలి? ఏవిషయాల్లో వారికి తర్ఫీదు ఇవ్వాలి అన్న విషయాల్లో భిన్నాభిప్రాయాలు వున్నమాట వాస్తవమే.

స్త్రీలు బ్రహ్మచారిణులుగానే యుండదలచినప్పుడు విద్యా విధానము వేరుగా నుండినా — సంసారిణులు కాదలచినప్పుడు మాత్రము — వారు నేర్చుకొనే విద్య సంసారిక జీవితానికి తోడ్పడునదిగా మాత్రము ఉండవలెనన్నది-నిర్వివాదాంశమేకాదా? బాలునకైనా, బాలికకైనా పల్లెగ్రామమున ఇచ్చు ప్రాథమిక విద్యా విధానము మాత్రము ఒక్కటే — అయినా అందులో బాలికలకు ప్రత్యేకించిచెప్పు సంగీతము - కుట్టుపని - శిశుసంరక్షణ (ఆహారనియమములు - ఆరోగ్యపద్ధతులు) మొదలైనవాటిలో కొంత తేడా కనబడుతోంది. ప్రత్యేకించి బాలికలకుచెప్పే విద్యలలో కొన్ని విషయాలు లేకపోలేదు.

కుటుంబములో స్త్రీలు - పురుషులు - పిల్లలు వున్నారు - వీరంతా వారికి చేతనైనా సహాయం ఆ కుటుంబానికి చేస్తేనే వాళ్ళ జీవితవిధానం సక్రమంగా వుంటుంది - పురుషులు శ్రమపడి సంపా

దిస్తారు - స్త్రీలు ఇంటికి కావలసిన పనులు చూసు కుంటారు - పిల్లలు బడికిపోయి చదువుకున్నా తీరిక సమయాల్లో - ఆడపిల్లలు తల్లికీ - మొగపిల్లలు తండ్రికీ సహాయపడవలసి వుంటుంది - అందుచేత ఆడపిల్లల చదువులోను - మొగపిల్లలకిచ్చే విద్యలోనూ కొంత తేడా కనబడుతోంది - ఆహార పదార్థాల విలువ తెలుసుకోవడంలోగాని - రుచికరములైన పదార్థములు తయారుచేసుకోవడంలోగాని - ఆరోగ్యవిధులు అనుస రించటంలోగాని - ఇంటి లెక్కలు వ్రాసుకోవడం - రోగములు - వాటి చికిత్సా విధానములు - అంటు రోగములు - వాటి నిరోధక మార్గములు - శిశుసంర క్షణ - ప్రథమచికిత్స - ఇత్యాది అనేక విషయాలలో స్త్రీలు తర్ఫీదును పొందియుండాలి. ఈగలు, దోమలు, ఎలుకలు మొదలగు క్రిమికీటకాదులవల్ల సంభవించేహాని - అపకారము - స్త్రీలకు ముఖ్యంగా తెలిసివుండాలి - అప్పుడు వారు తగిన జాగ్రత్తలు - ఇంటిదగ్గరవుండి తీసుకుంటారు - అటువంటి సహాయ సంపత్తికి దోహదమిచ్చే చదువు ఆడపిల్లలకి చెప్పించటం మంచిదికాదా !

కుట్టుపనినేర్చిన ఆడపిల్లలు ఇంట్లోవుంటే - దర్జీ వానికిచ్చే డబ్బు దండుగవుండదు సరికదా - చినిగిపోయిన దుస్తులు మరొక మూడుమాసాలైనా ఉపయోగించటానికి వీలుంటుంది - ఇలాగే అల్లిక పనులు - చేతిపనులు నేర్చిన పిల్లలు ఇంట్లోవుంటే ఎంతో సహాయంగావుంటుంది.

ప్రథమ.చికిత్స నేర్చిన స్త్రీలు ఇంట్లోవుంటే - అడుగడుక్కీ డాక్టరు దగ్గరకు పరుగెట్టవలసినవసరం ఉండదు సరికదా - ప్రమాదం అతిప్రమాదంగా మారిపోయే అవకాశంవుండదు - అనవసరపు ఖర్చులు తగ్గుతాయికదా ! ఇతర విషయాలతోపాటు యీ విషయాలుకూడా స్త్రీలు నేర్చివుండాలి.

చదువుకొనిన స్త్రీలు - సంసారం చక్కబెట్టుకొనడంలోను - పిల్లలను కనిపెంచటంలోను - సమాజాన్ని ఉద్ధరించటంలోను - సంఘసేవకురాండ్రై - సేవచేయడంలోను అందమున్నదిగాని - పురుషులవలె - స్త్రీలుకూడా సోమరులు కావడంలో ప్రయోజనం లేదు - సేవకావృత్తిలో ఘనతలేదు - చదువుకొనిన స్త్రీలు గ్రామాలకుపోయి - తోడి స్త్రీలను ఉద్ధరించాలి. స్త్రీ సమాజములను స్థాపించాలి. సంసారిక విషయములు వారితో చర్చించి నాగరికమైన జీవిత విధానములు వారికి నేర్పాలి. ప్రతి గ్రామస్థుని భార్యకు - ఆరోగ్య విషయములు, ఆర్థిక విషయములు - రాజకీయములు - అధునాతన పద్ధతులు మాతా శిశు సంరక్షణ-బాలబాలికలకిచ్చు శిక్షణమొదలైన అనేక విషయములు తెలియచెప్పవలసివుంది. గృహములు ఆరోగ్యవంతములుగాను, ఆర్థిక సమృద్ధితోను వుండాలంటే స్త్రీలకా విషయాలు తెలిసి వుండాలి. ఆ మార్గాలు వారికి బోధించాలి. ఇందుకు స్త్రీలే తగినవారు. స్త్రీ సంఘసేవకులే ముఖ్యంగా గ్రామ పునర్నిర్మాణానికి అవసరం - అవకాశమున్న ప్రతి స్త్రీయు ఈ ఉద్యమానికి చేయూత నియ్యాలి. ఒక్క స్త్రీ ఒక్క కుటుంబాన్ని బాగుచేసి, ఆ ఇంట్లో ఆనందాన్ని కలుగచేస్తే చాలు.

పల్లెనగల పంతులమ్మలు - హెల్తువిజటరు - లేడీ డాక్టరు - పెద్ద ఇంటివారి గృహిణులు - బడిపంతుళ్ళ భార్యలు - ఇంకా ఇతర సంఘసేవాసక్తిగల స్త్రీలందరు ఒక సమాజముగ నేర్పడి గ్రామాభివృద్ధికీ - గ్రామ పునర్నిర్మాణమునకు ఎంతైనా కృషిచేయగలరు. ఈ సందర్భంలో ప్రభుత్వంవారుకూడ తగు సహాకారమును సలహాయున్ను యిస్తారు. శిక్షణ పొందిన స్త్రీ సంఘసేవకులను నెలజీతముమీద నైనా ఏర్పాటుచేయవచ్చును. ప్రతి గ్రామంలోను ఒక రిద్దరిని ఏర్పాటుచేయడం మంచిదేకూడా - వారు గ్రామంలో జరిగే అభివృద్ధి కార్యక్రమాల భోగట్టా ప్రభుత్వానికి తెలియపరచి తగిన సహాయమును శీఘ్రముగా పొందటానికి అవకాశం వుంటుంది. స్థానికముగనున్న సంఘసేవకులను ఒకచోట జతపరచి శిక్షణయిచ్చి బహు ముఖముల జరుగవలసిన నిర్మాణ కార్యక్రమములను నిర్విఘ్నముగ కొనసాగించగలరు.

గ్రామమున లభించిన ఉచిత సహాయమును -

అనగా సంపత్ రూపములోగాని - శ్రమరూపములోగాని - ఉదారులిచ్చిన దానమును పునర్నిర్మాణ కార్యక్రమములో కేంద్రీకరింపచేయవచ్చును - గ్రామమున కొక సమాజము, తాలూకాకొక సంఘమును - జిల్లాకొక బోర్డును స్థాపించి రాష్ట్ర ప్రభుత్వనకు ఎప్పటికప్పుడు - గ్రామములలో జరుగు అభివృద్ధి కార్యక్రమములయొక్క వివరములు తెలుపుచుండవచ్చును. పునర్నిర్మాణములో, తరుచు ఈ సంఘములయొక్కయు, బోర్డులయొక్కయు సమావేశములు నెలకొకతూరి జరిగితేనే మంచిది. ఒకరి అనుభవమును మరియొకరు తెలిసికొనుటకు - పని సులభము చేసుకొనుటకు అవకాశముండగలదు.

ప్రభుత్వమువారికన్నా - సంఘసేవకుల కన్నా కూడా - స్త్రీ సమాజములే గ్రామ పునర్నిర్మాణంలో ఎక్కువపనిచేయగలరు. అభివృద్ధి అన్ని ముఖములా సాధించగల్గుతారు. దీనికి సందేహంలేదు.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౪౧

అచ్యుతుం డాది మధ్యాంత రహితుఁ డప్ర
 మేయుండు పూర్ణుండు శ్రీయుతుండు
కూటస్థరూపుండు, కోటిమన్మథ తేజుఁ
 డాజాను బాహుండు, రాజఘనుఁడు
జ్ఞాన రూపుండు నాశనము లేని మనుజుఁ
 డఖిల దిశల నిండి యాడువాఁడు
చావు పుట్టుక లేక, సత్యస్వరూపుఁడై
 మోక్ష సౌఖ్యమొసంగు ముఖ్యుఁ డఖిల
వస్తువులకు, సాక్షియగుచు వఱలువాఁడు
శ్రీ విరాట్స్వరూపుండు, ప్రసిద్ధవ్యక్తి
దోషరహితుండు, లోఁగొన్న తోరమైన
భువనములవాఁడు, ప్రజలకై ముదముతోడ
వేషములఁగొన్న వాఁడు, సేవించువారి
రక్షణమొనర్చు తారకరాముఁ గొలుతు.

౪౨

పూర్ణచంద్రునివంటి ముద్దుమోముగలాఁడు
 పల్లవాధరుఁడయి బరగువాఁడు
రాధ హృదయమందు-రంజిల్లు శుభగుండు
 సూర్యసమానుండు సుందరుండు
దైత్యవంశంబును ధ్వంసంబొనర్చిన
 శ్రీరమానాథుండు చిన్మయుండు
రఘువంశ వర్ధనుం డఘము బాపెడివాఁడు
 హృదయ కుండలియందు మెదలువాఁడు
శేషశాయి, నాదు-చిత్తవీథి మెలఁగి
పాపబుద్ధిఁ బాపి, భవ్యసుగుణ
తతినొసంగుఁగాత! తారకరాముని
సేవసతమొనర్తు చిత్తశుద్ధి

౪౩

నిఖిల నిలయుఁడైన నిగమగోచరుఁడీవు!
 ఆకాశరూపుఁడై యలరుదీవు!
సగుణ, నిర్గుణుఁడైన సరసరూపుండీవు!
 అంగుష్ఠ రూపుఁడై యలరు దీవు!
ఆకాశ రంధ్రమధ్యమమందు, నివసించి
 మోక్షశోభను గల్గి మురిసెదీవు!
సత్త్వరజస్తమోతత్త్వ శూన్యుండీవు
 తరియింపఁ జేసెడి తజ్ఞుఁడీవు!
తత్త్వమస్యాది లక్ష్యుఁడై దనరెదీవు!
శ్రీ సుషుమ్నానాడిని జేరి చెలఁగు దీవు!
రామ! తారకనామ! నిన్నేమముగను
ప్రార్థనము సేతు రక్షింపు భక్తవరద!

౪౪

మునుల మనములకు, ముదముసే కూర్చుచు
 ముక్తికారణుడైన శక్తివీవె!

స్థాయివై, కూటస్థచైతన్య రూపుఁడై
సకల వరదుఁడైన సాక్షివీవె!
నాదాంత తత్త్వాత్ముఁడై, దాశరథియునై
కమల నిలయుఁడైన జ్ఞానివీవె!
ప్రకృతి శూన్యుఁడగుచుఁబ్రకృతి మాన్యుఁ
డగుచు
సంతోషమును జెందు సరసుఁడీవె!
పరగ నోంకారధ్వనియొక్క బ్రహ్మమీవె!
శ్రీ సహస్రార పద్మంబుజెంది, యందు
స్థానమును గొన్న శ్రీ రామచంద్రుఁడీవె!
భక్తి నీసేవనొనరింతు పరమపురుష!

౪౫

తనదు యానందంబె తానుగానున్నాడు
శివుఁడు, బూజింపఁబ్రసిద్ధి నుండె
పరమ పదము బొంది పావనుడై నాడు
ప్రకృతి శూన్యుండయి వఱలుచుండె
దయకు సముద్రుఁడై, తానిర్గుణుండయి
పరమ పురుషుఁడౌచుఁ బరగుచుండె
రక్తితోడుత, సహస్రార పద్మమునందు
నివసించి, సంతోష నియతినుండె
శ్యామల శరీరుఁడవ్యయ చరితుఁడూర్జి
తుఁడు, పరబ్రహ్మరూపంబుతో, రమించఁ
దగిన శ్రీ రాము సతతంబు ధ్యాన నిష్ఠఁ
బ్రార్థనమొనర్చి సేవింతుఁబరమభక్తి.

౪౬

వైకుంఠలోకాధిపతివీవు! దేవతల్
మునులు, నీపాదముల్ మ్రొక్కుచుండ
వారి కిరీట యుజ్జ్వలకాంతి, నీ స్వర్ణ
పాదపీఠంబును ప్రభలుగొలుప
నిందు చంద్రునివంటి నెమ్మోముతో నొప్పి
ణికృమకుటంబు, మాన్యమైన
శ్రీధనుర్బాణముల్ జెలువార ధరియించి
ఓంకార పీఠమందొప్పుగాగ
నధివసించి జానకితోడ, యాశ్రయించు
వారి పాపముల్ హరియించి, వరములొ
నొసఁగు
రామ చంద్ర! ధ్యానింతును రక్తితోడ
భక్తమందార! రక్షింపు పరమపురుష!

౪౭

సాకేత పురములో చారు రత్న వినిర్మి
తంబు, మంటపమొండు దనరుచుండు
కల్పక మచ్చట కలదు; విమానంబు
మధ్య, నష్టదళపద్మము వెలుంగు;
నందు వన్నియకెక్కు సుందర సౌధంబు
వెలయు; సుగ్రీవ విభీషణాంజ
నేయులు, దమ్ములునియతితో సేవింప
వారి మధ్యనునీవు వఱలినావు

ఇంద్ర నీల కోమలగాత్ర! ఇనకులేశ!
రామ! రఘువంశ తిలక సీతామనోహ
రా! మనసునందుఁ బ్రార్థింతు రామచంద్ర!
వరద! తారక రామ! కాపాడుమయ్య!

(సశేషము)

# అనపోతు

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

(పల్నాటి చరితలో అనపోతు ఒక నిరుపమాన నిష్కళంక శౌర్య ధనుడు, స్నేహితునికొరకు ప్రాణాల నర్పించిన త్యాగి... అతని అంతిమ సందేశమే ప్రస్తుత కథా వస్తువు.)

(బాలుడు అనపోతూ బొంగరాలాడుతుంటే బొంగరము అన్నమ్మ అనే వైశ్య స్త్రీ కాలికి తగిలి రక్త మెచ్చింది. అపుడు)

బాలచంద్రుడు:_ఆగు అన్నమ్మా! ఆలా నోరు పారవేశికోకు, పొరపాటున నీ కాలికి బొంగరము తగిలినంత మాత్రాన మాపౌరుషాలు వమ్ము కావు.

అనపోతు:_ఏమిటమ్మా! ఆలా వాగుతావు. నీవు ఎన్నయినా నన్నను కాని మా బాల అన్నయ్య నంటేమాత్రము సహింపను.

అన్నమ్మ:_(కోపంతో) అబ్బో! దిగారు మనగాళ్లు, పెద్దోళ్లు యుద్ధం చేస్తుంటే ఇంకా బొంగరా లాడుతూ కులుకుతున్నారు, వీరులు, మీరూ మగ వాళ్ళేనా! ఛీ ఛీ, మీ కంటే ఆడాళ్లు నయం.

అనపోతు:_ఆఁ, ఏమన్నావు, మాటలు తిన్నగా రానియ్యి, ఎవరనుకున్నావు. (అని మీదికి పోబోతాడు.)

బాల:_(అనపోతునువారిస్తూ) క్షమించు అన్నమ్మా! మాది పొరపాటే, నిన్ను ఇంతసేపూ ఏమేమో అన్నందుకు మనసులో ఉంచుకోవద్దు, నిజంగా తెలియని విషయాన్ని తెలిపి మహోపకారం చేశావు. నీ మేలు ఎన్నటికి మరచిపోము వస్తాము. రా! అనపోతూ, వాళ్ళనుకూడా రమ్మను.

అన:-అదేమిటి? బాలా! ఆలా మాట్లాడు తావూ?

బాల:-అవును అమ్మతో విచారించి అన్ని వివరాలు తెలుసుకుందాము.

(అది ఐతాంబ అంతఃపురము, బాలుడు అన పోతూ మిగిలిన అయిదుగురు సంగడీంద్రు వెళతారు.)

బాల.-అమ్మా! యికదాచి లాభంలేదమ్మా! అసలు జరిగిందేమిటో చెప్పు, నా దగ్గర దాపరిక మెందు కమ్మా! పదిమంది నన్ను ఎత్తిపొడవటం ఎందుకు? నేనేమి వీరుడినికానా? నాలో వీరరక్తం ప్రవ హించటంలేదా? నాకు పగతుర సంహరించ టము సంతోషదాయకంకాదా? ఎందుకమ్మా నాకీశిక్ష, నీవుకూడా నన్ను కించపరుస్తావా? చెప్పమ్మా! చెప్పు, నీ పాదాలు పట్టుకుని వేడు కుంటున్నాను.

ఐతాంబ:_ఏమీలేదు నాయనా ... ఎవరో గిట్టని వాళ్లు ఏమేమిటో అనుకుంటూ ఉంటారు. అంటూవుంటారు. వాటన్నిటిని ఏమిటి అని అడు గుతే నేనేం చెప్పేది! ఏమీలేదు కాని పోయి ఆలా తిరిగిరాండి - సరేనా.

అన:_అమ్మా! నీవుకూడా మాకు ఈ విధంగా పిరికిత నాన్ని నేర్పుతావా? ఎందుకు దాచిపెడతావు! నేనునీకు పుత్రసమానుణ్ణి. నన్నుకూడా కాదం

టారా? చెప్పు-యుద్ధము ఎక్కడజరుగుతూంది. అంత అన్యాయానికి ఒడిగట్టినవారెవరు! చెప్పు! ఈ క్షణమేపోయి వారిరక్తమాంసాలను కాకులకు గద్దలకు వేస్తాను. పల్నాటిలోపోరును అంతము చేస్తాను. అమ్మా వారిని బూడిదపాలు చేయటానికి పెద్దవారు పోవాలా? మేము అర్హరము బాలుడు చాలమా? చెప్పమ్మా! ఇంకనూ దాచటమెందుకు.

ఐతాంబ:-అనపోతూ! నీ తల్లివంటి నాకు నీ శౌర్య సాహసాలు తెలియవనుకున్నావా? కాని ఇంకా మీకు అందుకు సరిపడే వయసు రాలేదు నాయనా! కాని నీవీరవాక్యాలు వింటుంటే నేను ఎంతో ఆనందపడుతున్నాను.

బాల:-అమ్మా! అన్యథా ప్రసంగము వల్ల మమ్ములను మభ్యపెట్టజూచుట నీవంటి వీర పత్నికి ధర్మమూ, న్యాయముకాదు. ఉన్నది ఉన్నట్లు చెప్పు నాన్నగారికి సహాయంచేయటం...అందులో రణరంగంలో అంతకంటే యింకేకావాలమ్మా నీ బాలచంద్రునికి. సరగున చెప్పమ్మా! మే మేము గురముపోయి రణరంగములో సింహాల పగిది వీర విహారం చేస్తాము. శత్రువులను తునకలు చేస్తాం ఏం అనపోతూ!

అన:-బాలా! మన పరాక్రమాలు అమ్మకు తెలియనివా? ఏదో ఆమెకు మనపైనుండే వాత్సల్యము నిజాన్ని బైటపెట్టనివ్వటములేదు. అమ్మా నీవు చెపితే చెప్పినట్లు లేకపోతే, ఇక ఈ అనపోతు నీకు కనిపించడు. తెలుసా

బాల:-అవునమ్మా, మేము నీకు కనిపించము, మమ్ములనే అనుమానిస్తున్నావా! చెప్పమ్మా

ఐతాంబ:-ఆగు బాలా! ఇక దాచికూడా ప్రయోజనములేదు, నాన్నగారు కారెమపూడిలో యుద్ధరంగమందున్నారు, నాయకురాలు, నరశింగరాజు చేసిన కుట్రవల్ల.

బాల:-అవునమ్మా! తెలుసు అలరాజు హత్య.

ఐ:-అందుకే ఈ యుద్ధము.

అన:-అంతవరకూ వచ్చిందా బాలచంద్రా! ఇక ఉపేక్ష అపాయకరము-నేడే బయలుదేరివెళ్ళి ఆ శత్రువులను నామరూపాలులేకుండా చెయ్యాలి. త్వరగా సిద్ధపడు, నేడే ప్రయాణము. అమ్మా! దీవించమ్మా, విజయలక్ష్మితో తిరిగిరావాలని.

బాల:-అవునమ్మా! నేడే ప్రయాణము సాగిస్తాను, శలవీయమ్మా!

ఐ:-నాయనా, ఈ పసితనంలోనే యుద్ధరంగములో ప్రవేశిస్తారా! ఇంకా చిన్నతనముపోలేదు; అప్పుడే రణరంగంలో దూకుతారా! ఒక విధంగా నేను ఎంతో సంతోషిస్తున్నాను; ఒక విధంగా ఎంతో బాధపడుతున్నాను.

అన:-అమ్మా! నీవు ఎంతో ఉత్సాహంతో పంపుతే మేముకూడా అంత సులభంగా అంత త్వరగా విజయలక్ష్మితో తిరిగి వస్తాము, దీవించమ్మా!

ఐ:-అలాగే నాయనా, అనపోతూ నిజంగా నిన్ను చూస్తుంటే నా హృదయం ఆనందంతో నిండిపోయింది. బాలుడికి నీ బోటి స్నేహితుడుండటం వాడి అదృష్టము.

అన:-అదేమిటమ్మా! ఈ మాత్రానికేనా? బాలుని కొరకు నా ప్రాణాలనైనా చిరునవ్వుతో త్యాగం చేస్తాను.

బాల:-(అనపోతును కౌగలించుకొని) అనూ, నేనెంతో ధన్యుణ్ణి, నీ వంటి మిత్రరత్నము కలిగిఉండటము నా అదృష్టమే, అమ్మా! వెళ్ళతామమ్మా!

ఐ:-నాయనా ఒక మాట, నీవు నీ భార్య మాంచాల దీవెన తీసికొనిపో నాయనా, విజయలక్ష్మి తప్పక మిమ్ము వరిస్తుంది.

అన:-వస్తామమ్మా!

(నిష్క్రమిస్తారు)

(ఐతాంబ అనతిప్రకారము బాలుడు, అనపోతూ

మిగిలిన సంగడీండ్రు యుద్ధరంగానికి బయలుదేరు తారు, బాలుడు మాంచాలదీవెనకొరకు అందరూ వస్తారు మాంచాల అనపోతు బ్రాహ్మణుడని తెలుసు కొని అతనిని యుద్ధరంగానికి తోడ్కొనిపోవుట శుభదాయకము కాదని, అతను యుద్ధములో మరణిస్తే పాపం పట్టుకుంటుందని బోధిస్తుంది. బాలుడు అనపోతును యుద్ధరంగానికి తీసికొనిపోకూడదని నిశ్చయించుకుంటాడు.)

అన:- బాలచంద్రా, యుద్ధరంగం దగ్గరైన కొలదీ నా సంతోషం అభివృద్ధిచెందుతుంది. త్వరత్వరగా నడవాలి, ఈలానీకు సాయపడే అవకాశము లభించినందుకు నిజంగానేనెంతో అదృష్ట వంతుడిని.

బాల:-అవును నీవంటిమిత్రుడు దొరకటముకూడా నా అదృష్టమె.

అన:-అలా నన్ను పొగడకు బాలా!

బాల:-అవును అనపోతూ! మరచాను. మాంచాల గృహంలో నాకరవాలము మరచిపోయి వచ్చాను. తీసికొనిరా. నీవు వచ్చేవరకు ఈ మర్రి చెట్టునీడనే కూర్చుని ఉంటాము, త్వరగారావాలి సుమా!

అన:-అలాగే కాని మీరు మాత్రము యిక్కడే ఉండాలి,

బాల:-ఆఁ అలాగేఉంటాము.

(అనపోతు వెళ్ళిపోతాడు)

బాల:-(స్నేహితునితో) అదిగో ఆ మర్రిచెట్టుపైనే చెప్పినట్లు వ్రాయి మనం వెళ్దాము,(వెళ్ళిపోతారు)

(అనపోతు ప్రవేశము)

అన:-బాల, అన్నయ్యా, ఎక్కడున్నారు. అరె పలు కరే! ఏమిటిది ఏదో వ్రాసినట్లున్నారే (చదువును)

అనపోతూ! ఈ విధంగా నిన్ను మోసగించి నందుకు నన్ను క్షమించు, విధిబలవత్తరము అవుటవలన ఈలా చేయవలసివచ్చింది. నీతో ముఖాముఖి చెప్పి నిన్నుఒప్పించలేనని ఈ విధంగా చేశాను. మావదిన చెప్పింది. నీవు బ్రాహ్మణుడివి. యుద్ధంలో చనిపోతే పాతకముచుట్టు కుంటుంది. కాబట్టి నీవు వేరేవిధంగా అనుకో వద్దు. ఈ మర్రిచెట్టుదాటివస్తే నాపైన శ్రీచెన్నకేశునిపైన.

ఇట్లు నీ

బాలుడు

అన:-(దుఃఖముతో) ఎంతపనిచేశావు బాలా! ఈలా జరుగుతుందని కలలోకూడా అనుకోలేదు, నీవు కూడా నన్ను మోసముచేస్తావా! అబద్ధమాడి నా పరోక్షంలో ఈ విధంగాచేసి నా కాళ్ళకు బంధాలు తగిలించావా? నేనే అపకారం చేశాను. బ్రాహ్మడినై పుట్టటముతప్పా! నీతో కూడా రణరంగములోదూకి శత్రువులను చీల్చి చెండాడాలని ఎంతో ఆశపడ్డానే, నా ఆశ నిరాశకావలసిందేనా? ఇదేనా న్యాయము? ఇదేనా ధర్మమూ? నా కోర్కెలన్నీ గాలిమేడ లేనా? అవును నేను అంత అదృష్టవంతుడి నేలా అవుతాను. అంతటి సదవకాశము నా కెందుకు లభిస్తుంది. నిష్కల్మషంగా ప్రేమిం చానే, నీ కష్టాలే నావిగా భావించానే_అట్టి నన్ను బ్రాహ్మణుడనే సాకుతో వదలిపెట్టి వెళతావా? వెళుతూ నీపైనే వట్టుపెడ తావా? బాలా! ఇంతకంటే హాయిగా నీ కరవాలముతో నన్ను చంపినా ఎంతో ఆనం దించేవాడినే. ఈ విధంగా నన్ను నిష్ఫలషాలు చేస్తావా? నా శరీరము, బలము, శక్తి ఉత్సాహము ఎందుకు పనికిరానివిగా ఒక్క క్షణంలో మారిపోయినవే? ఈ క్షణంలో నీవు ఏంచేస్తుం టావో? శత్రువులను తునుమాడుతుంటావు.

# సర్వాయి పాపడి కథ *

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు



ఇదొక చిన్న జంగంకథ. దుఃఖాంతకావ్యం. అంతా గేయమే. వచనం లేనేలేదు. దీని ఊత పదం 'తందానతాన'.

ఈ కథకి రాయలసీమలో ప్రచారముంది. ఔరంగజేబుయొక్క దుష్టపరిపాలననుంచి స్వాతంత్ర్యం కోరిక ఒక దేశభక్తుని కథ కాబట్టి ఇది చారిత్రకం.

సర్వాయి పాపణ్ణి గురించి మహమ్మదీయచరిత్రకారులుకూడ తమ గ్రంథాలలో తడిమేరు. ♦ ఔరంగజేబుయొక్క చివరికాలంలోనివాడు పాపడు. ఇతను తల్లినిగాక, సోదరిని బాధించి ధనం లాగుకొన్నాడు. సైన్యాన్ని ఆయత్తపరచి గోలుకొండను గాక హైదరాబాదు, ఒరంగల్ కోటలను కొల్లగొట్టేడు.

పాపడు ఫౌజుదారులను, జమీందారులను బాధించగా, వారు అతన్ని పట్టుకొన ప్రయత్నించేరు. అంతట పాపడు కొలాస్‌జా జమీందారైన వెంకటరావు దగ్గర దాగుకొన్నాడు. కాని తన పనులు ఎప్పటిలాగె సాగించగా అతన్ని చెరబెట్టేరు. రాజకుమారుడికి జబ్బు కుదిరితే అందరు ఖైదీలను విడుదల చేస్తాము అను మొక్కుబట్టి అందరితోపాటు పాపడుకూడ విడుదల అయ్యేడు.

అప్పుడు అతను సర్వయ అను మరొక తిరుగబాటుదారుణ్ణి కలుసుకొన్నాడు. ఇద్దరూకలిసి షాహపురంలో కోటను కట్టేరు. దానికి పాపారావుపేట అను పేరు పెట్టేరు.

కూల్‌పాల్ (కొలనుపాక) పరగణా ఫౌజుదారుడు, ఖాసింఖాను, ఆఫ్గను అను ఇద్దరు సేనానాయకులకు సైన్యాలిచ్చి పాపారాయుడిమీదికి పంపేడు. యుద్ధంలో ఖాసింఖాన్ మరణించేడు. కాని మహమ్మదీయులు మరొకసారి దండయాత్ర చేసేరు. తిరుగుబాటుదారులు పారిపోగా తురకలు మట్టికోటను ధ్వంసంచేసిపోయేరు. పాపయ్య, సర్వయ్యలు తిరిగి షాహపురానికి వచ్చేరు. కాని ప్రజలు ఔరంగజేబుకు విన్నవించుకోగా అతను రుస్తుం దిల్‌ఖాన్ అను నాతని హైదరాబాదుకి సుబేదారుగా నియమించేడు. కాని ఈ కొత్త సుబేదారుడు ఆ వీరులను ఏమీ చేయలేకపోయేడు. ఔరంగజేబు కొమారుడు కాంబక్స సైన్యాలతోవచ్చి ఏమీ చేయలేకపోయేడు.

పాపారాయుడు 1708లో రెండు మూడు వేల కాలి భటులతోను, అయిదు వందల గుర్రపుదళంతోను ఓరుగల్లుకోటను ముట్టడించి గెల్చేడు. తర్వాత తరిగొండ (తాటికొండ)లో కోటను నిర్మించేడు.

---

* సర్వాయిపాపడి కథను ఉప్పలగౌరయ్యసెట్టి, షావుకారుపేట, మదరాసువారు 1906లో అచ్చువేసేరు. ఆ ప్రతిని ఆధారంగాచేసుకొని చొల్లేటి నృసింహశర్మగారు 15.8-1952 నాటి గోల్కొండ పత్రికలో ఒక వ్యాసం రాసేరు. ఈ వ్యాసంలో పుస్తకంలోని భాగాలను ఉదహరించేరు. నాకు దొరికిన ప్రతి వెస్టువార్డు అండ్ కంపెనీ, చాకలిపేట, మదరాసువారు 1931 లో అచ్చువేసినది. పదహారు పుటలు. పాకెట్టుసైజు పుస్తకం. పైప్రతికిని దీనికిని చిల్లరభేదాలు మాత్రమె ఉన్నాయి. సరియైన ముద్రణకివి తోడ్పడతాయి.

♦ చొల్లేటి నృసింహశర్మగారు గోల్కొండ పత్రిక 15.8.52 నాటి ప్రతిలో "ఏడు ఘడియల రాజు సర్వాయి పాపడు" అను వ్యాసాన్ని ప్రకటించేరు. దానిలో చారిత్రక విమర్శ విపులంగా చేసేరు.

అయ్యో! నాకా భాగ్యము లేదుకదా! నాకా అదృష్టము లేదుకదా! ఎంత నిర్భాగ్యుడిని! బాలచంద్రా, ఒదినగారు చెప్పినంత మాత్రమున నన్ను వదలి వెళ్ళుటకు నీ మనస్సెట్లొప్పినది, నా హృదయం నీకు తెలియదా? నా భావాలు నీకు కరతలామలకము లేగదా? అట్టి నీవు నన్ను వదలిపోయావా? ఇక నేజీవించి మాత్రము ప్రయోజనమేమున్నది, అదిగో పాలను తీసికొని ఎవరో వస్తున్నట్లుంది, ఓ అమ్మా, ఇదిగో ఈ నా శిరమునుగొని బాలచంద్రునికి యివ్వవలసినది; ఇచ్చేటప్పుడు - నీతో యుద్ధరంగంలోకి రానందుకు ఎంతో బాధ పడ్డాడని చెప్పవలసినది. ఇక నిన్ను చూడలేనని ఎంతో విలపించానని చెప్పవలసినది. ఇంతవరకు తనను ఎంతో శ్రద్ధతో తోబుట్టువులాగా చూచినందుకు కృతజ్ఞత తెలిపాడని చెప్పవలసినది. నన్ను మరచిపోవద్దని వేడుకున్నాడని చెప్పవలసినది. నీకొరకు ఎంతటి త్యాగమైనా చెయ్యదల్చుకున్నాడని ఆ అదృష్టము లభించలేదని చెప్పాడని చెప్పవలసినది. చివరసారిగా నా భక్తి భావబంధురమైన నమోవాకము లర్పించినానని చెప్పవలసినది.

(అని అనపోతు తన ఖడ్గముపై ఒరుగుతాడు)

(అనపోతు శిరమును తీసికొనిపోయేవరకు అక్కడ రాజీ కుదురుతుంది, సహపంక్తి భోజనము ఏర్పాటు చేస్తుంటారు, ఈ శిరమును చూచిన బాలచంద్రుడు యుద్ధాన్ని ప్రకటిస్తాడు.)

---

# హృదయస్మృతులు

భంగ ఉత్తుంగ తరంగం
ఉజ్జ్వల జ్వాలాశిఖ పరిష్వంగం
నా వ్యథిత మథిత హృదయం

భీకర నీరద ఘోషలు
విలయ తాండవ జీమూతాలు
మదంత రాంతర వేదనలు
నా సుందర నిర్మిత నికుంజంలో

సాగిన మృదుల రాగలతలు
అరవిరిసిన లతాంతములు
భూపతన జీర్ణ వికీర్ణములు

గతులు తప్పిన హృదయస్మృతులు
చెరిగి నిలిచిన మధురస్మృతులు
నా జ్వలిత హృదయ తుషారతుంపరలు
శిథిల తేజీ తారకాక్రాంతులు

"మురళి"

---

ప్రజలు అప్పటి ఢిల్లీపాదుషాయైన బహద్దర్ షా శరణుజొచ్చేరు. అతను సైన్యాలను పంపేడు. ఆ సమయంలో పాపయ్య కూల్ పాల్ కోటమీదికి వెళ్లేడు. పాదుషా సైన్యాలు రెండు భాగాలై ఒకటి కూల్ పాల్ మీదికి, రెండోది షాపురంమీదికి వెళ్ళేయి. పాపయ్య తరిగొండను చేరేడు. శత్రు సైన్యాలు తరిగొండను ముట్టడించేయి. స్వజనుల ద్రోహంవల్ల అతను హసానాబాద్ పారిపోయేడు. శత్రుసైన్యాలు అక్కడ ముట్టడివేసేయి. పాపణ్ణి పట్టుకొని శిరచ్ఛేదంచేసేరు. ఈ మోస్తరుగా ఆ స్వాతంత్ర్య వీరుడు అంతమయ్యేడు.

ఈ జానపదగేయాన్ని రాసినకవి సర్వమ్మ అనేది పాపని తల్లిపేరు అన్నాడు. చరిత్రకారులు మాత్రం సర్వయ్య మరొక వీరుడిపేరు అన్నారు. పాపడు తల్లిని బాధించి డబ్బు తీసుకొన్నాడని జానపదకవి చెప్పగా, సోదరినుంచి డబ్బు గ్రహించేడని చరిత్ర కారులన్నారు. వీటిలో చరిత్రకారులమాటే సరి యైనది కావచ్చు.

ప్రజలు ఔరంగజేబుయొక్క దుష్పరిపాలననుంచి విముక్తికోరేరు. కాని పాపడు పడేపాటుకూడ అందుకోసమే అని వారు గ్రహించలేకపోయేరు. అతనిలోని నేరములను మాత్రమె వారు చూడగలిగేరు. పాపడిని స్వజనులే శత్రువుల కప్పగించి తమ పార తంత్ర్య బంధాలను మరింతగా బిగించుకొన్నారు, సిగ్గు! సిగ్గు!!. పాపడు రాచరికాన్ని గణించేడు, కాని కారణాంతరాలవల్ల ప్రజలను కూడగట్టుకొని రాలేకపోయేడు.

## కథాకాలం, రచనాకాలం

ఔరంగజేబుయొక్క అంత్యకాలమందు పాప డున్నాడు. ఔరంగజేబు 1707 లో మరణించేడు. కాబట్టి అతని తర్వాత వచ్చిన పాదుషాయే పాపడి అంతానికి కారకుడయ్యేడు. పాపడి జీవితం 1710 లో ముగిసిందని చెప్పవచ్చు. జంగంకథారచనకూడ ఇంచుమించుగా అప్పుడే అని చెప్పవచ్చు. కాబట్టి ఈ జంగంకథా రచనాకాలం 1710 అని చెప్పవచ్చు.

జంగంకథలో అంతరంగిక సాక్ష్యం ఒకటి మాత్రమె కనబడుతూంది. గువ్వలచెన్నుని శతకం (క్రీ. శ. 1600 ప్రాంతంలోది) లోని —

కలవిద్య లెన్నియైనను
కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా

అను చరణాలే జంగంకథలో —

కలవిద్య లెన్నియైనను
కులవిద్యకి సాటిరాదు రా
సర్దారిపాప!

అని ఉంది. కాబట్టి ఈ గేయరచన ఆ శతకం తర్వాతది అని చెప్పవచ్చు. కాని ఈ గేయంలో ఒక విశేషముంది. జంగంకథ చివరిభాగమంతా బొబ్బిలిపాటవరసలో ఉంది. ఈ గేయం 1710 ప్రాంతంది. బొబ్బిలియుద్ధం 1757 లో జరిగింది. ఆ తర్వాతిదైన ఈ పాటవరస, పైకథలోకి రావ డానికి అవకాశంలేదు. గేయమంతా ఒకే వరసలో ఉంటుంది, కాని కొంత ఒకలాగు కొంత మరొక లాగు ఉండదు. 1710 నుంచి వస్తూన్న గేయంలో చివరిభాగాన్ని ఆ తర్వాత మార్చివేసేరని చెప్పవల సుంటుంది, బొబ్బిలిపాటవరసకి ప్రచారం కలిగింది. పాపడి వీరత్వంకూడ బొబ్బిలివీరులలాగే ఉందని, చివరిభాగాన్ని పాటకులు ఆ మోస్తరుగా మార్పు చేసేరుకాని అంతకంటె మరేమీలేదు.

ఈ కథనాటి ముఖ్యపట్టణాలు.- నెల్లూరు, బందరు, కడప, చందనూరు (?), చెన్నపట్టణం.

## జంగం కథా సంప్రదాయాలు

జంగం కథలో వీరుడి పుట్టుక అద్భుతంగా ఉండాలి. కాని సహజత్వానికి ఎక్కువ లీవిచ్చిన ఈ కవి వాటిని చాలవరకు విసర్జించేడని చెప్ప వచ్చు. దివిటీలకు నూనెలేకపోగా పాపడు వాటిని నూనెవాగులో ముంచమన్నాడని జన శ్రుతి, కాని

ఈ అతిశయోక్తి జంగం కథలో లేదు. పాపడు ఆవులను కాచుకొంటూ నిద్రపోగా, అతని తల మీద ఒకపాము పడగవిప్పి గొడుగులాగు పట్టిందనే విషయం జనశ్రుతికి కొత్తకాదు. పాపడికి జడిసి ఎల్లమ్మ దేవత గుడిలోంచి పోయిందిట! జంగం కథలలో సాధారణంగా కనబడే రంగస్థాని భోగం దాని బదులుగా ఎరుకల నాంచారమ్మ ప్రవేశ పెట్టబడింది. పన్నెండు శిరస్సుల నాగుపాము ఇట్టి కథలకు సామాన్యమే.

అంకెల సంప్రదాయం విశేషంగా కనబడుతూంది. ఏడు అంకె అనేకచోట్ల వస్తుంది. ఏడుగురు పెండ్లాలు (10), ఏడుదున్నలు (13), ఏడు కొప్పెర్లధనం (13), ఏడుగడియలయుద్ధం (14), ఏడు లోట్లకల్లు మొదలైనవి.

పన్నెండు సంప్రదాయానికి ఉదాహరణలు పన్నెండు శిరస్సులనాగం, పన్నెండుగురు నేస్తులు.

సాధారణంగా జంగం కథలు సుఖాంతంగా ఉంటాయి. కాని ఈ కవి ఆ సంప్రదాయాన్ని విసర్జించి దుఃఖాంతంగానె ఉంచేశాడు.

## రసం

ఇది వీరరసప్రధానమైన గ్రంథం. సర్దారు పాపడి యొక్క వీరవేషాన్ని కవి చక్కగా వర్ణించేడు. యుద్ధవర్ణనగూడ బాగానె ఉంది. పాపడు గవళ్ల కులస్తుడని తెలియజేయడానికి అనేకరకాల కల్లు పేర్లు చెప్పబడ్డాయి. ఎరుకల నాంచారి పాత్రను కవి ప్రవేశపెట్టేడు. గవళ్లకులస్థుడైన పాపడు శౌర్యధైర్యాలను జూపి సర్దారు పాపడయేడు.

సర్వాయి పాపడికి అటుతర్వాత క్రీ. శ 1880 లో బయలుదేరిన చిన్నప్ప రెడ్డికి, కొన్ని పోలికలున్నాయి. కాని పాపడు రాజకీయంగా ప్రవర్తించేడు. చిన్నప్పరెడ్డి స్వీయప్రయోజనానికి పాటు పడ్డాడు.

గేయంలోని మచ్చుభాగాలు —

ఇంటి ఆవులను మేపమంటాది సర్వమ్మ తల్లి
తాటి కల్లే కట్ట మంటాది సర్వమ్మతల్లి
ఈత కల్లే కట్ట మంటాది సర్వమ్మ తల్లి
ఈత బెల్లం వండమంటాది సర్వమ్మ తల్లి

♦ ♦ ♦

బొబ్బిలి పాటవరసను అనుసరిస్తూన్న ఒక తునక—

ఈటె చువ్వల బారు గనుకనె తర్లుతు ఉన్నాది
కత్తుల యొక్క బారు గనకనె తర్లుతు ఉన్నాది.
పన్నెండు కొప్పెర్ల ధనము గనకనె దండుకు పంచెనురా
దండు దళమునె తీసుకొని ప్రయాణ మయినాడు.




**భక్తిగేయ గుచ్ఛము :** శ్రీమతి ఓలేటి సూర్యప్రభాదేవి. ప్రచురణకర్త శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి, తాడేపల్లిగూడెం. వెల 25 నయాపైసాలు.

ఇందలి గేయములు జాలిగొలుపుచు భగవత్ప్రార్థనలుగా నొప్పుచున్నవి. దైవభక్తి తొణికిసలాడుచున్న యీ గేయములు రచయిత్రియొక్క భగవద్భక్తి, కవితానైపుణ్యములను చాటుచున్నవి. ముఖ్యంగా సామాన్య స్త్రీలు సులభంగా పాడుకొనుట కనువుగా నున్నవి.

**38 మణిదీపాలు :** శ్రీ పులిపాక జగన్నాధరావు, ఆంగ్లభాషాశాఖ, హిందూ కళాశాల, గుంటూరు. వెల 18 నయాపైసాలు.

ఇందులో సుభాషితాలు, 'జలపాతము' అనే చిన్నకథయున్నవి. మణిదీపాలుగా రూపొందిన సుభాషితాలు ప్రకృతి రహస్యాల ననేకం బయల్పరచి మానవునకు విజ్ఞాన వికాసములను సమకూర్చి జీవయాత్రను సుగమంగా చేయునవిగా నున్నవి. ఇందులోనికథ సయితము చిన్నదయినా బాగున్నది.

**శ్రీపురం బంగళాలో హత్యలు :** శ్రీ గిడుగు రామమూర్తి. ప్రచురణకర్తలు: భానుపబ్లిషింగ్‌హౌస్, 17 కృష్ణాపురం, అక్బరాబాద్, మద్రాసు 24. వెల 50 నయాపైసాలు.

విరివిగా వెలువడుతున్న డిటెక్టివ్ నవలలు విశేషముగా ప్రచారములోనున్న యీ నాడు శ్రీరామమూర్తిగారు సయితం వాని వైపుకు మొగ్గారు.

డిటెక్టివ్ నవలలవలన ప్రయోజనమెట్టిదైనా వాని చలామణి మాత్రము విరివిగా నున్నది.

ఈ రచన యీ నాడు వెలువడుతున్న నవలలకు ఏమాత్రము తీసిపోదు. కథ నడక, ఊహాపోహాలు సరసంగాను, ఉత్సాహపరచుచున్నవి.

---

'భాగ్యనగర్' జన్మదిన సంచిక మా కార్యాలయమునకు చేరినది. ఆకర్షణీయమైన ముఖచిత్రంతో అమూల్యమైన వ్యాసములతో రూపొందినది. పత్రికా నిర్వహణయందలి సాధక బాధకములను అధిగమించి జాతీయాభ్యుదయాన్ని ప్రోత్సహించుటకు పూనుకున్న యీ పత్రికను ప్రజానీకం ఆదరించగలదని ఆశిస్తున్నాము. సంపాదకులు శ్రీ గోవాడ నిరీక్షణరావు. ప్రతులకు 'భాగ్యనగర్' కార్యాలయం, మచిలీపట్నం, కృష్ణాజిల్లా. వెల 50 నయాపైసాలు.

రాయలకళాపరిషత్ (హిందూపురం) కార్యదర్శి, ఉపాధ్యాయుడునగు శ్రీ దుర్భాక కృష్ణయ్యగారి షష్టిపూర్తి కర్ణాటక - ఆంధ్ర - ఆంగ్లేయ సన్మాన సంచిక మాకు చేరినది.

ఇందులో శ్రీ డి. కృష్ణయ్యగారికి షష్టిపూర్తి సందర్భమున సమర్పించబడిన పద్యములు. సన్మాన పత్రములు, ఆయన జీవిత విశేషములను గురించి, పాండితీగరిమలను వివరించే వ్యాసములుగలవు.

# సంపాదకీయములు

## ఇండియా అధికారభాషా సమస్య

భారతదేశ అధికారభాషగా హిందీతోబాటు ఇంగ్లీషునుకూడ ఉంచాలనియు, అధికారభాషగా హిందీని అమలుపరచుటకు కాలనిర్ణయమంటూ చేయవలదని మద్రాసు ప్రభుత్వముకోరడములో అసమంజసమేమి లేదు.

మనదేశంలోనేకాక యావత్ప్రపంచములో ఇంగ్లీషుభాషకుగల స్థానమును, దానివలని ప్రయోజనములను మనము విస్మరించలేము. కాని జాతీయభాషగా హిందీభాషయొక్క ఆవశ్యకతను కాదనలేము. హిందీ, ఇంగ్లీషు భాషలు రెండూ ప్రజావసరాలకు జాతీయ, అంతర్జాతీయ రంగాలలో కావలసినవే. అంతమాత్రంచేత ఆ భాషల అభ్యాసంవలన ప్రాంతీయ భాషలపురోభివృద్ధి కుంటుపడుతుందని భావించుట పొరబాటు.

కళాశాలలో విద్యాబోధన ఆంగ్లమునకు బదులుగా హిందీలో చేయాలనే వాదమునకు అనుభవజ్ఞులు, విద్యావేత్తలు సమ్మతిని తెలుపుటలేదు. ప్రాంతీయ భాషాభిమానముతో యితర భాషలను అవసరాలను గుర్తించకుండా ద్వేషించి అనవసర రచ్చలు జరుపడం శోచనీయము.

ప్రభుత్వము ప్రాంతీయ భాషల అభ్యాసానికి ప్రాధాన్యమిచ్చుచు, హిందీ, ఇంగ్లీషు భాషలను ప్రోత్సహించవలెను. క్రమంగా ఇంగ్లీషు స్థానంలో హిందీ జాతీయభాషగా ఎట్టినిర్బంధము లేకుండా అమలులోనికిరాగలదు.

## ఆహార ధాన్యాల ధరలు

ప్రధాన జీవితావసరాలలో ఆహార ధాన్యములు ఒకటి. కేంద్ర రాష్ట్రప్రభుత్వములు ఆహారసమస్య క్లిష్టతను ఒకవంక ప్రకటిస్తూ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికా నిర్వాహణకు ఆహార సమస్యపరిష్కారం ప్రధానమయినదయియుండగా ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ప్రాంతాలు వరదలకు, కాటకములకులోనయి కూడ ఆహారోత్పత్తిలో మనరాష్ట్రం అభివృద్ధిదశలోనుండుట హర్షించతగినది.

నీటి పారుదల సౌకర్యాలు పెరిగినకొలది ఆహారధాన్యాల ఉత్పత్తి పెరుగుదల సహజమైనా ధాన్యం ఉత్పత్తిదారులు, వ్యాపారస్థులు, వినియోగదారుల పరస్పర సద్భావ, క్షేమాన్నుద్దేశించి ధాన్యం సేకరణ, ధరలనిర్ణయం, పంపకంలాటి విషయాలలో ప్రభుత్వము యీనాటికంటె మరింతశ్రద్ధ చూపాలి.

ఆహారసమస్యను వాస్తవికత కనుగుణ్యంగా పరిష్కరించాలంటే ధాన్యంసేకరణ, ధరల నిర్ణయంలో నిర్ణీతవిధానమును అమలుపరచాలి. మిగులు రాష్ట్రాలేవో, తరుగు రాష్ట్రాలేవో, మిగులు రాష్ట్రాల నుండి తరుగుప్రాంతాలకు లభ్యముకాగలధాన్యం నిల్వల వివరాలు నికరంగా ప్రభుత్వము తెలిసికొనకలుగాలి. ఉత్పత్తి దారులకు న్యాయమైనధరను నిర్ణయించడము ఎంతముఖ్యమో వినియోగదారుల కొనుగోలు శక్తిని సయితము గుర్తించకలుగాలి. రైతుదగ్గర మిగులుగానున్న ధాన్యమును ప్రజావసరాలకు కొనుగోలు చేయడానికి ప్రభుత్వము సర్వదా సిద్ధంగానుండాలి.

ఆహారసమస్యా పరిష్కారంలో ఉత్పత్తిదారుడు నష్టపడకూడదు; వినియోగదారుడు కష్టపడకూడదు. ఉభయులక్షేమందృష్ట్యా ప్రభుత్వము నిర్దుష్టమైన విధానమును రూపొందించి అమలుపరచగలదని ఆశిద్దాం!

## శ్రీ హేవళంబినామ సం॥ర మార్గసిర, పుష్యమాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 సం॥ డిసెంబరు నెల | 16 | సో | ద 28-34 చి 53-7 అమృతయోగం |
| | 17 | మం | ఏ 23-6 స్వా 49-38 త్యా 3-46 |
| | 18 | బు | ద్వా 19-24 విశా 47-2 త్యా 3-50 తిథిద్వయం |
| | 19 | గు | త్ర 14-40 అనూ 45-28 మాసశివరాత్రి |
| | 20 | శు | చతు 12-5 జ్యే 45-5 |
| | 21 | శ | ● అమా 10-42 మూ 45-54 త్యా 4-4 |
| | | | **పుష్యమాసము** |
| | 22 | ఆ | శుపా 10-36 పూషా 47-56 |
| | 23 | సో | వి 11-44 ఉషా 51-7 త్యా 4-13 |
| | 24 | మం | త 14-0 శ్ర 55-19 |
| | 25 | బు | చ 17-17 ధ 60-10 |
| | 26 | గు | పం 21-21 ధ 0-29 |
| | 27 | శు | ష 25-57 శ 6-7 కుమారషష్టి |
| | 28 | శ | స 30-50 పూభా 12-4 |
| | 29 | ఆ | అ 35-42 ఉభా 18-3 అమృతయోగం |
| | 30 | సో | న 40-16 రే 23-50 త్యాజ్యాభావః |
| | 31 | మం | ద 44-17 అశ్వ 29-10 అమృతసిద్ధియోగం |
| 1958 సం॥ జనవరి నెల | 1 | బు | ఏ 47-29 భ 33-46 త్యాజ్యాభావః, వైకుంఠఏకాదశి, ఆంగ్లసంవత్సరాది |
| | 2 | గు | ద్వా 49-39 కృ 37-25 త్యా 4-15 |
| | 3 | శు | త్ర 50-40 రో 40-0 అమృతయోగం |
| | 4 | శ | చతు 50-23 మృ 41-22 త్యాజ్యాభావః |
| | 5 | ఆ | ○ పౌ 48-51 ఆర్ద్రా 41-31 త్యా 4-1 చిదంబరక్షేత్ర ఆర్ద్రాదర్శన మహోత్సవం |
| | 6 | సో | కృపా 46-2 పున 40-26 |
| | 7 | మం | వి 42-6 పుష్య 38-13 |
| | 8 | బు | త 37-13 ఆశ్రే 35-5 దగ్ధయోగం |
| | 9 | గు | చ 31-37 మ 31-13 |
| | 10 | శు | పం 25-31 పూఫ 26-50 |
| | 11 | శ | ష 19-13 ఉఫ 22-16 |
| | 12 | ఆ | స 12-58 హ 17-44 భానుసప్తమి, అమృత సిద్ధియోగం |
| | 13 | సో | అ 6-59 చి 13-33 భోగ్యుత్సవం |
| | 14 | మం | న 1-34 ఏష్యం 55-6 స్వా 9-56 ఉత్తరాయణ పుణ్యకాలం |
| | 15 | బు | ఏ 53-3 విశా 7-7 పశువుల పండుగ |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశాన ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

వనితకు ఏ వయస్సైనా లోధ్ర మంచి పుష్టి నిచ్చే టానిక్. ఆరోగ్యానికి. ఆనందానికి లోధ్రను మించిన టానిక్ లేదు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం






కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
రాయపేట - మదరాసు - 14.

ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాలకు ఏజంట్లు :
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం